శ్రీ

# ఆస్థానకవి

## సందేశము

ఆస్థానకవి

శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ

కవిసార్వభౌమ

## శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రి

ప్రణీతము



రాజమహేంద్రవరము

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్సునందు

ముద్రితము

1950

Dedicated

to

Sri Bharata Samrajya Lakshmi

THE GODDESS OF THE

INDIAN REPUBLIC

by

The Author

# అంకితము

శ్రీరఘురామముఖ్య నృపశేఖరపాలితమై మహోన్నత
శ్రీరమణీయమై సకలసేవితమై సుజనైకగమ్యమై
భూరిసుఖప్రదం బగుచుఁ బొల్పెసలారుచునుండునట్టి శ్రీ
భారతరాజ్యలక్ష్మికి శుభం బగుఁ బొంటె నొనర్తు నీకృతిన్.

శ్రీరస్తు

# ఆస్థానకవి

## ప్రథమోల్లాసము

శ్రీ విరాజన్ నిజభక్తసంతతులకున్ మృత్యుంజయత్వంబు ని
త్యామోదంబును బుత్రపౌత్రవిభవంబారోగ్యభాగ్యంబులున్
బ్రేమం గూర్చుచు లోక మేలుసలసావిత్రీమహాదేవి తా
నీమర్త్యాళికి సౌఖ్య మిచ్చి కరుణన్ వీక్షించి రక్షించుతన్.

### భారతమాతృ ప్రభావము

మ. భగవన్నిర్మితలోకజాలములలో భవ్యంబు భూలోక మొ
ప్పగ నమ్మధ్యమునందు సర్వసుగుణంబుల్ గల్గి భాసిల్లు నం
దుగణింపందగుసర్వధర్మములతోఁ దూఁగాడుచుం బుణ్యముం
దగులం జేయుచుభారతోర్వియెసగుం ధన్యత్వముఙ్గాంచుచున్

శా. ఎందుం దక్కువలేక సేతువుహిమాద్రీంద్రంబు ప్రాక్పశ్చిమా
నందాంభోధులు చుట్టు నెల్ల లగుచుండం బేర్మి భాసిల్లునీ
హిందూదేశపవిత్రికిన్ సకలదేహీష్టార్థసంధాత్రికిన్
"వందేమాతర" మంచుభక్తిభరితస్వాంతుండనై మ్రొక్కెదన్.

చ. భరతుఁడునాయకుం డగుచుఁ బాలనముం బొనరించుదాన నా
భరతుని పేర నొప్పితివి భారతమాతృక! నీదుగర్భముం

దరయ నవీనదంబులు మహాధరశేఖరముల్వనంబులున్
బరఁగుచునుండుఁ బెక్కు లవి భారతజాతికిఁ బ్రాణదంబులై.

ఉ. నీయుదరంబునం గలమణిప్రకరంబుల రత్నగర్భవై
పాయక పాఱునేళులను బండినపంటల సస్యగర్భవై
యేయెడ రంతిదేవ రఘు నృగ్వసరణ్యముఖుల్భజింపఁ దే
జోయుత వైనతల్లి వని స్తోత్రము చేయుదు నిన్ను భారతీ. 5

సీ. రామకృష్ణాదీశ్వర వరాంశసంభవుల్
ప్రహ్లాద శుకముఖ భక్తవరులు
కాళిదాసాది సత్కవిరాజచంద్రులు
శంకరాది మతసంస్కారగురులు
పాణినిప్రముఖ శబ్దప్రపంచజ్ఞులు
జనకరాజాది విజ్ఞానఘనులు
శిబికర్ణముఖదాతృశేఖరులును వివే
కానందముఖ్య మహామహులును

తే. త్యాగరాజాదిగానవిద్యావిశార
దులు మహాత్ములు పెక్కండ్రు తొల్లి నీవు
కన్నబిడ్డలు నీయశం బెన్నఁ దరమె
దివ్యసద్గుణసముపేత! దేశమాత! 6

శా. అంబా! నీయుదరాంతరంబునను దివ్యఖ్యాతికి న్మూలమై
జంబూవృక్షము పుట్టెఁ దత్ఫలరసస్రావంబునం జేసి స్వ
ర్ణదియై పాఱెను నేరడే అనఁగ నాబ్రహ్మోత్తరాభిఖ్యచే
జంబూద్వీపమునాఁగఁబొల్చితివి నిన్ జర్చింపసామాన్యమే.

సీ. శూరాగ్రగణ్యుఁడై వైరులఁ దెగటార్చి
ప్రతిభఁ గన్న శివాజిపార్థివుండు
కటకాదులను గెల్చి కవులసన్నిధిఁ బేర్మి
నందినకృష్ణరాయప్రభుండు
బంగారువర్షము రంగారఁ గురిసి పే
రెన్నికఁ గొను కాకతీశ్వరుండు
ఢిల్లిసుల్తాను నోడించి పేరందిన
ఘనుఁ డల్లమంత్రియుగంధరుండు

తే. భోజుఁడును విక్రమార్కుఁడు రాజరాజు
శాలివాహనుఁడును దొట్టిశౌర్యనిధులఁ
బెక్కురం గన్నదానవు వీరమాత
వెన్న సామాన్యమే నిన్ను హిందుమాత. 8

ఉ. స్వర్గము స్వర్గమంచు నుడి సల్పుచుఁ బొల్పుగ గారవింతు రా
స్వర్గమునందు భామ మెడబాయని దయ్యెడు నీతిబాహ్యులై
నిర్గతచిత్తులై సురలు నిత్యనివాసము చేయుచుందు రం
దార్గురుదొంగలెల్లపుడు నడ్డము నాఁకయు లేక మందుఁ ద్రాగిన్. 9

వ. సర్వఖండంబులయందు నీభరతఖండంబత్యంతస్తోత్రపాత్రం
బీఖండంబునకు. 10

తే. మూఁడుదిక్కుల సంద్రముల్ పోడిమిఁ గన
నుత్తరంబున హిమవంత మొప్పుచుండు
నందు ఛప్పన్న దేశము లతిశయిల్లుఁ
దత్ప్రభావము వర్ణింపఁ దరము గాదు. 11

చ. రతనపుఁ బీనుఁగొండలును రాసులు రాసులు గాఁగ సస్యము
బితికెడుభూప్రదేశములు మేల్పసిడిం గనుసేళ్లు నశ్వినీ
సుతులకు నేని కోరఁదగి చొప్పడియుండెడి మేటియోషధి
ప్రతతుల నిచ్చుదివ్యవనపంక్తులు నిచ్చటఁ జూడ వచ్చెడిన్.

సీ. అంభోధి యంతయు నాపోశనము పట్టి
వట్టిబయలు చేసె నట్టె యొకఁడు
చంద్రసూర్యాదుల సరణిని నక్షగిం
చినకొండ నణఁగిపోఁ జేసె నొకఁడు
త్ర్యంబకంబుననుండి తనవెంట రాఁ దెచ్చి
గోదావరీనది నాడి నొకఁడు
గంగాప్రవాహము నంగిటఁ బడ మ్రింగి
చెవినుండి వెడలిపోఁ జేసె నొకఁడు

తే. నీళ్లపైఁ గొండల న్నిల్పి నేర్పు మీఱ
సేతువుం గట్టె శతయోజనాయతముగ
నొకఁడు పెనుగొండఁ జిటికెన నూనె నొకఁడు
భరతవర్షంబునం దొల్లి పురుషవరులు. 13

తే. వేదశాస్త్రాదులు పురాణవిధులు వైద్య
శాస్త్రములు మహాప్రకృతిశాస్త్రములు మఱియు
యోగసాంఖ్యములును మహాత్మోచ్చగతుల
భరతవర్షమునందె సంభవము నొందె. 14

## — పూర్వరాజ ప్రతిభ —

మ. మనువిక్ష్వాకుదిలీపులు రఘువునా మాంధాతృముఖ్యుల్ నృపు
ల్మఱి హిందూప్రజ నేలి రవ్వల నృపుల్ నానాకులభ్రాజితుల్
వెనుకన్ మ్లేచ్ఛులు వైస హూణులు కడు విఖ్యాతి గైకొంచునూ
ర్లును వేలేండ్లుగ భారతప్రజల నేల్ భూపాలురై రెన్నఁగన్.

ఉ. రాముఁడు రాజ్యమేలుటకు రానయియుండిననాఁడుగో లెఁద
ద్భూమిజనుల్ మహాసుఖముఁ బొందుటఁజేసి సురాజరక్షిత
శ్రీమహి రామరాజ్యమని చెప్పుచునుండెద రట్టిపేరు గై
కో మతిచేయు రాజు గయికో నగు మంత్రుల సత్కవీంద్రులన్.

తే. అట్టియాచార మీభరతావనియం
బౌద్ధకాలము వర్తించెఁ బిదపఁ బిదప
హూణరాజుల చేతిలో నుర్వి చిక్కి
కొనినదాది నశించెఁ దద్ఘనపదంబు. 17

సీ. ధర్మంబు లెవ్వియుఁ దలచూప నీరైరి
వర్ణాశ్రమాదులు పలచ దనుచు
క్రీస్తె దేవుడు గాని క్రీస్తుకంటె మఱొక్క
దేవుఁడు లేడని తిరిగి చెప్పి
రామకృష్ణాదుల నామముల్ చెప్పిన
సీసీల వాదముల్ చేసి చేసి
హైందవాచారము లడుగంటునట్టులు
తంత్రము లెన్నియో తవిలి చేసి

ఆ. కట్టు బొట్టు జుట్టు కదలిక మొదలిక
మాట పాట నీటు మేటి గోటు
మాఱు నట్లు చేసి మా హైందవుల నిట్లు
సలిపినారు పరాయిజాతివారు. 18

ఉ. పన్నులవెన్నియో గతులఁ బర్వఁగఁ జేయుచు హిందుదేశమం
దున్నధనం బదంతయు నయోగ్యులఁ జేకొని రాజపూసలన్
గొన్ని కరంబులందగులుకొనొనరించుచు మాయచేయుచున్
సన్నకసన్న సర్వమును సన్నగిలం గొనిపోయి రింగ్లిషున్.

ఉ. చట్టము వారిపట్ల నొకచక్కియు హైందవజాతిపట్ల నా
చట్టమె వేఱువే ఱయినచక్కిని వర్తిలఁ జేయుచున్ మహా
ఘట్టములందు నిచ్చమెయిఁ గల్పనఁ జేయుచు శాసనంబులన్
దిట్టతనంబున న్మనల దేవురుగొట్టుబఁ జేసి రావొరల్. 20

శా. అన్యాయంబుగ నాక్రమించుకొని రాయాంగ్లేయులీ భారతం
బన్యుల్ వారలపాలనంబునను దేశాధీశులున్ భూప్రజల్
మాన్యత్వం బఱి మాడిపోవ నయిరీ త్మామ్ముండలిన్ బోర సా
మాన్యుల్గారరుబుగ్రుంచును ధయోన్మగ్నాత్ములైయ త్తఱిన్

తే. అన్యపరిపాలనంబున నస్మదీయు
లెల్ల నలజడి నొందుచు నేలిక లగు
వారిదాస్యమునం బడి వారొసంగు
గంజినీళ్ళకుఁ బాల్పడఁ గలిగి రయయొ. 22

ఉ. బానిసవృత్తికిం గుదిరి వారికి సేవ యొనర్చువారమై
మేనను బ్రాణముల్ నిలుచుమేఱకు నై కడుహీనకార్యముల్

పూని పోఁకచ్ఛువారమయి పొట్టకు నట్టిటు కొట్టుకొంచు నా
హూణుల చేతిక్రిందఁ జెయి యొంచినవారము నైతిమక్కటా.

భుజంగప్రయాతము.

పరాధీనవృత్తిన్ బ్రవర్తించుకొంచున్
ధరన్ మర్త్యు లెంతే వ్యథం బొందుచుండన్
కరం బెన్న లే కేప్రకారాంతరంబుల్
వరస్వాంతు లావార ల్ప్రవర్తించి రంతన్. 24

— కాంగ్రెసూత్పత్తి —

శా. ఆంగ్లేయుల్ మన దేశమున్గొని మహాహంకారులై యేలుచో
నాంగ్రెయాదికళాప్రవీణుఁ డగుదాదాభాయి నౌరోజి యే
సంగ్రామంబులు గల్గకుండఁగ ధరాచక్రంబు పొల్పొంద నా
కాంగ్రెస్సంస్థను నిల్వరించె మనువిజ్ఞానంబు పెంపొందఁగన్.

తే. లజపతియు మోతిలాలు తిలకు బెనర్జి
పాలు నరవిందుఁడును దాసు గోఖలెఁ బెక్కు
రనఘచరితులు దానికి నధిపు లగుచు
నుద్ధరించిరి సంస్థ సత్యోచ్చరీతి. 26

చ. తిలకు మహానుభావుఁ డెద దేనిఁ దలంచునొ దాని నెన్నఁగా
బలుకును బల్కినట్లు తనవర్తనముం గనఁ జేయుఁ జేసిన
ట్లిలఁ గలవారల న్మెలపు నింతటివాఁ డయి యుండియాకు మే
ల్గలిగెడు కార్యముల్ నడిపెఁ గాంగ్రెసుసంస్థనుగాచునట్టిఁడై.

సీ. ఆనందమోహనుఁ డనుబోసు ఘనుఁ డయ్యె
నలసురేంద్రబెనర్జి యధికుఁ డయ్యె
రామమోహనరాయి రాజకీయంబుల
నత్యధికుం డయి యతిశయిల్లె
బిపినచంద్రపాల్ వీరుఁడై వెలుగొందె
దేవేంద్రనాథుఁడు దీప్తి మెఱసె
నలరవీంద్రుఁడు జగత్ఖ్యాతకవీంద్రుఁడై
యెల్లలోకమునందు నింపుమిగిలె.

తే. మదనమోహనమాలవ్య మఱియు విద్య
సాగరుఁడు మోతెలాల్దాసు సౌకతాళి
లోనుగాఁ గలప్రముఖులు లోకమంగ
ళార్థ మెంతయుఁ గృషి సల్పి రధికశక్తి.

సీ. ఆంగ్లేయపాలనం బాత్మ సైపఁగ లేక
యుల్లదాదాభాయి యతిశయమున
బరమమిత్రులఁ గూడి పరిపరివిధములఁ
బ్రేమించి నడపె కాంగ్రేసుసంఘ
మితవాదియై కొంత మేలుసంపాదించె
నాత్మదేశమునకు నపుడు నపుడు
నానామెడ లజపతిరాయియు గోపాల
కృష్ణఘోక్లేయును గీర్తిగాన్న

తే. బాలగంగాధరుఁడు మోతెలాలు నెహ్రూ
షౌకతాలిసోదరులు ప్రసాదబాబు

వస్త్రవ్యాపారము లోనగువార తెల్ల
సంస్థ యభివృద్ధి యొనర్పు సలిపి రప్పుడు. 29

మ. అతివాదుల్ మితవాదులందుగలరై వ్యాహారముల్ సేయుచుం
బ్రతివర్షంబు మహాసభల్ జరుపుచున్ రాజ్యాంగదోషాదులన్
బ్రతిపాదించుచు మారిసారె ప్రభులా వ్యాపారులం బల్కుచుఁ
క్షితిసౌఖ్యంబును గోరి నాయకులు వాసింగాంచి రంచన్మతిన్.

శా. స్వాతంత్ర్యంబది నాదుజన్మమునకుం జర్చింపఁగా హక్కు నా
దే తెల్లంబుగ భారతం బొరుల కిం దేమాత్ర మేఁ దావు లే
దే తెల్లుల్ పనిసేయ విట్టితఱి మాదే కాన మా కిచ్చి వే
వే తర్లం దగు నంచుఁ జాటెను దిలగ్వీరాధివీరుం డొగిన్ 31

క. సత్యాగ్రహంబు గైకొని
నిత్యము నిత్యము సహాయనిరసనము జగ
త్ప్రత్యయము చేసి లేపిరి
యత్యంతము నిద్ర నొందునఖిలప్రజలన్. 32

—♦ గాంధి-దక్షిణాఫ్రిక ♦—

తే. అట్టికాలమునఁ దక్షిణాఫ్రికాను
భారతీయులయిక్కట్లు వాపుపొంటె
గాంధిమాహాత్ముఁ డెంతయు గండుమిగిలి
యచటికిం జని ప్రభులతో నావడిఁ బడె. 33

శా. ఆదేశప్రభువుల్ మహాత్ముని మహావ్యాపారముల్ కానివం
చే దేఁ జూడక బందెఁ బెట్టి మిగులన్ హింసించి రందాత్మఁ డా

మోదంబున్ విడనాడ కెట్టినికృతుల్ మోహాడికల్పించినం
గాదంచాడకవానిబొందనగుచుంగావించె గష్టం బటన్. 34

కం. ఎంతో జరిగినపిమ్మటఁ
గొంతటిలోఁ బ్రభుతకరుణకుం బాత్రంబై
శాంతిం జేకుఱఁ జేయుచు
సంతసమున నిండియూకుఁ జనుదెంచె వడిన్. 35

సీ. శ్రీకరన్ చందుగాంధీకి మహాత్ముఁడన్
విఖ్యాతనామంబు వెలసె నపుడు
సత్యాగ్రహాము చేయ స్వాంతంబు లేకున్న
దేశనాయకులతోఁ దెలియ నగుచు
సలిపెఁ బ్రచారము సర్వదేశముల స్వ
రాజ్యసంప్రాప్తికై రమణ మెఱయ
బాలగంగాధరప్రభృతులం బట్టి బ్రి
టిషువారలపుడు పెట్టిరి జెయిలున

తే. నాయకులతో మహాత్ముఁడు పాయ కుండి
జెయిలు కష్టములం బొంద నఝు మెలంగె
సంతలోపలఁ దిలకుమహాశయుండు
భౌతికశరీరమును వీడి పైకిఁ జనియె. 36

ఉ. అంతమహాత్ముఁడాఖ్యుఁ డగు చండజిలోపలవందసీయుఁడై
కొంతన కెంతయే శ్రమకుఁ గొంకక క్షోణితలప్రజాళికై
గంతుకొనంగ వచ్చినను గాని సరే యని వెన్కఁజూడక
శ్రాంతము కస్తికోరిచిప్రచారముచేసె స్వరాజ్యమందఁగన్.

క. అహో హిట్లరుయుద్ధము
హాలాహల మగుచు వచ్చె నది సైరింపన్
జాల శ్రమంపడి రవనీ
పాలకు లింగ్లీషువారు బహువిధములుగన్. 38

తే. భారతీయులు గాంధిజీ ప్రభృతు లింగ్లి
యాకుఁ బోరాడుచుం జాల యావదు లిడఁ
దాళఁ జాలక బ్రిటిషుభూపాలు రెల్ల
రాజ్యమును వీడి చనిరి స్వరాష్ట్రమునకు. 39

ఉ. రాజ్యమునొందిభారతులురాజిలుచుండి మహాత్మగాంధినిన్.
బూజ్యుని రాజుగా సలుపఁ బూనక దేవునిగా భజించుచున్
రాజ్యము వానిమాటబడిఁ గ్రాలఁగ నేలుచు నెల్లవారికిన్
బ్రాజ్యసుఖంబు గల్గునటు పాలకులై ప్రజ నేలనై రిలన్.

సీ. అవతారమూర్తి యీయనఘ మోహనదాస
కరముచం దనుభక్తిఁ గనెడువారు
గాంధిమహాత్ముఁడు ఘనరాజ్యమును దేర
జన్మించె నని పూజ సలుపువారు
స్వార్థ మేనాఁడు రవంత యేనియు లేని
వాఁ డని మ్రొక్కంగ వచ్చువారు
తనశరీరము పరార్థంబే యని చరించు
శ్రీవిష్ణు వని చెంతఁ జేరువారు

తే. అగుచు భూప్రజ లెల్లరు నామహాత్ము
మాట జవదాట కాతనిమతముగుఁ జేరి

తండ్రి వలెను దేవునివలెఁ దలఁచి కొలుచు
చుండి రాబాలగోపాల మర్వ్యజనులు. 41

వ. ఇట్లున్నకాలంబున. 42

—♦ మహాత్ముని స్వర్గగమనము ♦—

చ. తురకలకున్ స్వరాజ్యమును దోఁచియొసంగుచునుండెవారికై
పరిపరిరీతులం బలికి వారివశంబున నుండువాఁ డటం
చరయకకూరచిత్తుఁ డొకఁ డామహనీయునిఁగాల్చిచంపె నె
ల్లరకు దురంతదుఃఖమయి లాావఝు చావగఁజేసెనందఱన్.

ఉ. అప్పుడు లోకమెల్లఁ బిడుగట్టిపవృత్తిని నాలకించి యే
చొప్పను లేక గొల్లుమనుచున్ రొదసేయుచునేడ్వసాగి రా
చప్పుడు దేవలోకముల సాఁగె నటన్నను సత్యదూర మం
చెప్పుడునుం దలంపఁదగ దేగెను మీఁదికి మీఁదిమీఁదికిన్,

సీ. అంత ఢిల్లీపురమందు లక్షోపల
క్షలుగాఁగ భూతలజనులు గూడి
పుష్పమాలలచేతఁ బొసఁగించునాసంది
పై మహాత్మునిమేను పరఁగఁ జేసి
ముందువెన్కల జనుల్ మూగి నడువ దుఃఖ
జలము కాల్వలు గట్టి జాలువాఱ
మందగమనముతో మఱి రెండుజాలకుఁ
జితిసమీపమునకుఁ జేర నరిగి

తే. యెల్ల రోంకారనాదముల్ సెల్లఁ జేయు
చుండ విప్రులమంత్రముల్ మొరసుకొనఁగ

మంచిగంధము చితమీఁద నుంచి శవము
నగ్నిహోత్రము దరికొల్పి రాక్షణమున. 45

సీ. అప్పుడు పెదపెద్ద లగువా రుపన్యాస
ములతోడ దుఃఖాంజలుల నొసంగి
చితికిఁ బ్రదక్షిణాల్ చేయుచుండం గడె
కచట భస్మమె శేషమై కనఁ బడెఁ
బిదప సంచయనాదివిధి దీర్చి భస్మము
నెమ్ముకలును గొన్నియేళ్ళలోనఁ
గలిపిరి గంగలో గౌతమిలోఁ గృష్ణ
వేణిలో మఱియుఁ గావేరిలోన.

తే. పిదప భూతలమం దగునను లోనఁ
బుణ్యతీర్థముల్ క్షేత్రభూము లందు
మెలపి రిలలోపలం గాక మీఁదిమీఁది
భూముల న్నిల్పి గన్నను బోలునదియె. 46

మ. ప్రతిపల్లిన్ బ్రతిపత్తనంబునఁ బ్రతిగ్రామంబునం దుత్తమ
క్షితుఁ డా మహనీయు విగ్రహములం జేయించి స్థాపించుచున్
ప్రతివారంబును మ్రొక్కుచుం బ్రజలేవంకీతియూరప్పనం
దతిభక్తిన్ నిలుపంగనుండిరనుచున్ వ్యాపారముం జేయుదున్

ఉ. రాముఁడు కృష్ణుఁడు న్వ్రాఁడి ధరన్ జనినప్పుడ హైన నిగ్గతిన్
భూమిజనుల్ తపించిరనఁ బోలదు గాంధిమహాత్ముఁ డెన్నఁగా
రామునిఁ గృష్ణునిన్ సుగుణరాజిని మించినవాఁ డటంచు వి
ద్యామహనీయమూర్తులగునార్యులు పల్కఁగ విందుమి త్తఱిన్

## —♦ స్వరాజ్యపాలనము ♦—

వ. అనంతరకాలంబున నిప్పుడు. 49

సీ. ఇండియానేత రాజేంద్రప్రసాదుఁడు
జవహరులాల్ ప్రధానివరుఁ డవల
వల్లభాయిపటేలు ఉపప్రధానియు నిత
రులు ఘనుల్ మంత్రు లాస్థలమునందు
మదరాస్పురిభుత్వముఁ బొదలించువారిలో
ముఖ్యమంత్రి కుమారమూర్తి మౌళి
భక్తవత్సలుఁడు గోపాలుఁడు మీనను
సంజీవియును గళాసత్కుఁజుఁడు
రామకృష్ణుఁడు లోనిరమ్యమూర్తులు మంత్రులై
రాజకీయముల్ తేజ మెసఁగఁ

తే. నడపుచుండియు రాజ్య మేల్కడిమిఁ గనుచు
భూజనాదరపాత్రులై పొలుపు మిగిలి
యుజడులు లేనివడువున మెలఁగికొనుచు
విభుత చెల్లించుచుండిరి వీర్యమున. 50

తే. సాంబమూర్తియు వేంకటప్పయ్య కొండ
రంగ పట్టాభి కాళేశ్వర ప్రకాశ
ప్రభృతులు స్వరాజ్యవృద్ధికై పాటుపడుచు
నడపుచుండిరి కాంగ్రెసు నాయకు లయి. 51

మ. కోటిగోరాట్నము శాంతిసూత్రనుల వేడ్కం జేయగా జాలితా
ననిశం బిష్ట స్వతంత్రసౌఖ్యము స్వరాజ్యంబందు సంధిల్లగా

నొనరించన్ మనుధర్మకర్తయనన్నై యుచ్ఛ్రితింగూర్చుచున్
బ్రణుతింపందగుఁదత్ప్రభావముజగద్వర్ణ్యంబుగావించుచున్

ఉ. శోకము లేనివాఁ డగునశోకుఁడు దాల్చినవైజయంతి యే
శోకము దాక నీయ దనుచుంబలుకం దగు నద్దియే మృగా
నీకవిభూత్తమం బగుచు నిల్చినసింహముమీఁద ప్రేలుటన్
గైకొని తేజమున్ రిపుల గండడఁగించెడు రీతిఁ దెల్పెడున్. 53

సీ. హైదరాబాత్పురి నల్లరు లగునట్టి
సరిహద్దుభూముల పరిసరముల
భటుల నెందఱనేని భద్రత చెడకుండ
నట్లు నిలిపి రాయుధాళితోడ
బంజరుభూముల బాగుపఱచుచు నా
హారాభివృద్ధి యా నట్లు చేసి
రనిశంబు మద్యపాననిషేధకార్యము
గావించి లోకముం గాచినారు

తే. హరిజనోద్ధరణము చేసి యనద లైన
వారలం గరుణించిరి వలసవచ్చి
నట్టి శరణార్థులం బ్రోచి రర్థమిచ్చి
వలఁతులై మహరాష్ట్రప్రభుత్వంబు వారు. 54

మ. ధరలం బెంచియువర్తకుల్ ప్రజలకున్ ధర్మంబు నాకెన్నియో
గరిమల్ సూపుచుఁ బశ్యతోహరులునా గైకోఁగ భూర్యర్థముల్
వరుసన్ వాని నెఱింగి సర్వమునకున్ గంట్రోలు గల్పించి యు
ర్వరకున్నాభ్యతఁ దోలంచిరెన్నఁగను మద్రాస్రాష్ట్రమంత్రీశ్వరుల్

తే. ఆనకట్టలు ప్రాజెక్టు లందు నందు
సలిపి చవిటిపఱ్ఱుల నెల్ల సస్యకలిత
మగుచుఁ బెంపొందఁ జేసి ప్రజాళిఁ బ్రోచు
పనులకుం బూనుకొనియుండి రని వచింతు. 56

తరళము. చవిటిపఱ్ఱులఁ దున్ని విత్తులు చల్లి ధాన్యము పండున
ట్లవని నల్గడఁ జేసి తిండికి పోవడుల్ పడకుండఁ జే
య వలెనంచుఁ దలంచు టొప్పెడు నట్టిదే యగు గానియో
ప్రవరులార వచింతు నొక్కఁడు పాటిఁ జేసి వినం దగున్ 57

మ. పరమాహారపదార్థముల్ గనెడుభూభాగంబులం దెల్లెడన్
పరికింపగఁ బొగాకుచే ప్రబలుటన్ ధాన్యాళిఁ బండింపఁజో
టరయం గామిని గర్వ్వవచ్చె ప్రభులారా? యిట్టిచేట్వోయకుం
డురహిన్ శాసనముంబొనర్పుఁడు ధరం బ్రోకారుగర్వాంతయున్.

తే. కిరసనాయిలు కంట్రోలు తొలఁగినంత
సన్నగిలిపోయి వెలయెల్ల జనుల కద్ది
సులభము లభించుచుండె నట్టులు సమస్త
మునకుఁ గంట్రోలుతీసినఁ బోవుఁ గఱవు. 59

ఆ. బ్లాకుమారకట్లు పరఁగుటకును వర్త
కుండు ప్రబలుచుంటకును జనాళి
కూడుగుడ్డ కిడుమ గుడుచుటకును ముఖ్య
కారణంబు సూవె కంటురోలు. 60

మ. మదరాస్మంత్రులుమంత్రవాదులగుచున్నాన్యక్రియల్సేయుచు
న్బదిలంబేర్పడజెన్న రాష్ట్రముప్రజల్ బాలించుచుంబూర్వరా

త్రిదశేంద్రుల్ బలె సత్కవీంద్రుల నస్తోద్దేశంబుఁ జెల్వుగో
మదిగావించి తెలుంగుబాసకు మొదల్ మాటాడిరయ్యంతలోన్.

తే. అరవమును గన్నడము మళయాళ మాంధ్ర
సంస్కృతంబులు మన కైదు సన్నికృష్ట
భాష లాస్థానకవుల నాపదములందు
నిలుప నగు నంచుఁ దీర్మానములు పొనర్చి. 62

వ. క్రమముగా నైదుభాషలకు నైదుగురు నాస్థానకవుల నాహ్వా
నించి నియమించుకొనిరని చెప్పిన కథకునిం గాంచి శ్రోత
లారాజకీయరంగంబులకుం గవిపండితులకుం గల సంబంధం
బేమి వారివలన రాజ్యపాలనంబునకు లభించులాభ మేమి
చెప్పు మనుటయు. 63

గద్యము:- ఇది కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి
శాస్త్రిప్రణీతం బయిన స్వరాజ్యాస్థానకవి
సందేశం బను గ్రంథంబునః
ప్రథమోల్లాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు

# ఆ స్థా న క వి

## ద్వి తీ యో ల్లా స ము

వ. అక్కథకుండు శ్రోతల కి ట్లనియె. 1

చ. కవులును మంత్రులుం గలియఁగా దె ప్రభుత్వముదివ్యమంగళ
ప్రవరము గా నెసంగెడిని వారలు వారికిఁ బ్రాణరక్షయుం
దవిలిపౌనర్పఁజాలుదురు ద్రవ్యము గూర్పగ నేర్తు రార్తులన్
దవినవిధంబునన్ నడపి తార్కొనఁ జేయుదు రున్నతస్థితుల్.

తే. కవులుమంత్రులుతనచెంతఁగలుగ ఱేఁడు
వారిపక్షమువాఁ డయి ప్రభుత ధర్మ
రక్షణము చేయుచును బ్రజారంజకుఁ డయి
రాజ్యపాలన మొనరించి పూజ్యుఁ డగును. 3

—◆ క వి-క వి త్వ ము ◆—

సీ. భూలోకమునఁ గీర్తి పొదలెడునందాక
స్వర్గాదిసౌఖ్యముల్ వఱలుచుండుఁ
గావున నాస్థానకవి గ్రంథములు చేసి
శాశ్వతంబుగ నిల్పు స్వామియశము

రామాయణాదులు వ్రాయకుండినఁ గవి
భువన మంధకారము పోవుఁ గాదె
వ్యాసభారతము నీసజ్జ లేకుండిన
రాజ్యపాలనవిధి పూజ్యమె కద.
తే. భూతలేంద్రుఁడు కను విప్పి మూయువఱకు
మనువు వ్రాసినవ్రాఁతలమార్గముననె
నడచుచుం గాదె యేర్పడి నడరఁ జేయుఁ
గాన ధరణీంద్రునకుఁ గవి ప్రాణ మరయ. 4

చ. తనయశ మెంతదాక వసుధన్ విదితం బగు నంతదాక న
జ్జనుఁ డల నాకమం దలరి సౌఖ్యములందులదూఁగుచుండునం
చనిమెద రార్యు లందున ననంత ననంతధనప్రదాయియై
యొనరిచి సప్తసంతతు లనూనయశంబిల నిల్పఁగాఁదగున్. 5

మహాస్రగ్ధర.
చతురుల్గావింప నీభూస్థలమునఁ జనునాస ప్తసంతానరాజిన్
గృతితక్కందక్షునాఖ్యుల్గిలమగునొకచోనిల్చి యేనాటికైనన్
గృతియాచంద్రార్కమైనిష్ఠితనిఖిలదిక్కీర్తితంబై వెలుంగున్
గృతులన్నిర్మించి వాల్మీకిముఖకవివరుల్కీర్తినింబొందిరెన్నన్.
వ. ఈయర్థంబు తేటపడ నొక్కపురాతనపుణ్యశ్లోకేతిహాసంబు
కల దాకర్ణింపుఁ డని మఱియును. 7

—• ఇంద్రద్యుమ్నుని కథ •—

క. కలఁ డింద్రద్యుమ్నుం డన
వెలసినరాజర్షి తొల్లి విహితాధ్వరుఁ డై

సలలితయశస్కుఁడై భూమం
డలమున నెలుఁగొంది చనియె నాకంబునకున్. 8

క. ఇంద్రద్యుమ్నుఁడు పెక్కేం
డ్లింద్రోపముఁ డగుచు నిర్జరేంద్రునియింటన్
సాంద్రామలకీర్తింగొని
చంద్రప్రభ నొప్పె నమరసన్నుతుఁ డగుచున్. 9

ఉత్సాహము. చాల కాల మిట్లు చనిన తన్మితలంబునందుఁ బే
రోలి మాయ వేల్పు లతనియొద్ద కేగుదెంచి భూ
పాల! క్షీణపుణ్యుఁ డైతి పద యిట వసింపఁగాఁ
జాల వచ్చుఁ గ్రిందఁ బడఁగ సడలఁద్రోచి రత్తఱిన్. 10

వ. త్రోపువడి యతండు మార్కండేయుని కడకుంజని తన్నె
ఱింగించి న న్నెఱుంగుదే యనిన నతండు నిన్ను నే నె
ఱుంగను కాని. 11

క. కల దింద్రద్యుమ్నం బను
కొల నట నాడీకజంఘకుం డనుబక మొం
డేరు నది ని న్నెఱుంగం
గలదాకో నాకంటెఁ బెద్ద గావుటకతనన్. 12

వ. అనిన నతం డతనితో నటఁ జని కొక్కెరాయిం బిలిచి తన
పేరు చెప్పి న న్నెఱుంగుదు వే చెప్పు మనిన నది యిట్లనియె.13

క. నే నిన్ను నెఱుఁగఁ జాలం
గాని మహాభాగులార! కల దిట వృద్ధై
తా నెఱుఁగు నకూపారుఁడు
నా నొడువం దగినకూర్మనాథుం డనుచున్. 14

వ. అడిగి చూత మని యెలుం గెత్తి దానిం బిలుచుటయును. 15

ఉ. ఆయులి వాలకించి జలమాంజలికార్మ్యము కూర్మిమించఁగా
నాయెడ కేఁగుదెంచుటయు నచ్చికహెచ్చఁగ మానిదానికా
రాయని పేరు సెప్పి మును గ్రాలినపేని నెఱుంగుదే యనన్
బాయనిబత్తి చిత్తమున బాముకొనం గమఠం బడంకువన్ 16

వ. ఒక్కించుక ధ్యానించి బాష్పపూర్ణనయనయుగళంబును
నుద్విగ్నమానసంబును వేపమానాంగంబును విసంజ్ఞకల్పం
బునై యెలుంగు రాల్పఁ ని ట్లనియె. 17

ఉ. ఏల యెఱుంగకుండెదనొ యేను మహాగుణభూషణు న్మహీ
పాలుని వాని వానిదయ వాసము చేయుచునుంటి నిందు నీ
కూలమునం దనేకశతకోటులు దక్షిణ లిచ్చి జన్నముల్
వేఁకువేలుచేసినిలిపెన్ మణియూపములెన్నియేనియున్. 18

ఉ. ఆతఁడు దక్షిణార్థముగ నర్థుల కిచ్చినగోగణంబులీ
భూతలమందు మెట్టుటను భూరిఖురంబుల గ్రొస్సి గ్రొస్సి కా
దే తగి యీ సరోవర ముదీరతనయ్యెఁ దదాహ్వయంబునన్
ప్రీతికిఁ గారణం బతని పేరు స్మరించితి నేను ధన్యుఁడన్. 19

మధ్యాక్కర. అని పల్కుచున్నంత నమరలోకము నందుండి దేవ
మునిసేవితం బయి ముదము పొదలించు పుణ్యవిమాన
మును గొంచు దేవతాముఖ్యు లరుదెంచి మోదము నించి
జననాథ! నీకీర్తి జగతిపై నొప్పఁ జనుదెమ్ము దివికి. 20

వ. అనిననింద్రద్యుమ్నుండు దేవవైమానికులంగాంచియిట్లనియె.

స్రగ్ధర.

మున్నెన్నో ధర్మకార్యంబులు పొనరించితిం బోయెనా పుణ్యమెల్ల
నస్త్రన్నైయిడ్డేను మీతోవ ఱియు నటకురాకున్నిట్కొన్నాళ్ళు మీద
న స్నీచందంబునం గ్రిందకుఁ బడి చెడ గెంటన్దలం త్రీరు గానన్
గొన్నాళ్లిందుండి యెప్పున్గదిరికొనఁ గృతింగూర్చి కావించివత్తున్.

తే. మీరు చనుఁడని ప్రార్థించి వారిఁ బుచ్చి
తొంటితనదేశమున కేగి దొడ్డకవుల
నాశ్రయించి కవిత్వము నల్ల నేర్చి
కృతులు చేయించి తాఁ జేసి నుతులఁ గయ్యె. 23

మ. మునుదాఁ జేసిననూతులుం జెఱువులున్ భూదేవతా పూజలు
న్ధననిక్షేపము లాలయంబులును నిత్యత్వంబుఁ గైకోక యిం
తననా కాలములోనె క్షీణమయి పుణ్యం బెల్లఁ బోకాఱె నం
దున నన్ భూమిఁ బడంగ నెట్టిరి సురల్ దోసంబు నాకేసునన్,

ఆ. ఇపుడు నేను నాశనప్రగతికిం గాక
శాశ్వతముగ నుండు సత్కృతులను
బొందఁ గలిగి నాఁడ ముం దెట్టిసేగియు
నాకుఁ గలుగఁ బోదు నాకమందు. 25

వ. అని కృతకృత్యుండై దేవతానీతదివ్యవిమానం బెక్కి స్వర్గం
బునకు నిర్గమించి స్థిరనివాసంబు గావించె నని మఱియును. 26

—♦ వేదములు కవిత్వమే ♦—

ఆ. కవనమే ప్రపంచకమున కాధారము
కవనమే సమస్తకార్యములకు

మూలమట్టి కవనముం దెలియుట లోక
మెల్లఁ దెలియు టనుచు నెఱుంగ వలయు. 27

శా. ఆదివిరాట్టు వేదముల నాదిమకాలమునన్ దలంపులోఁ
బోదిగఁ జేసి వెన్కఁ దనముం దగు బ్రహ్మను గాంచి సర్గమున్
గాదన కీవు చేయు మనగా నతఁ డే నసమర్థుఁడం బ్రభూ!
నీదగునాజ్ఞమై నడువ నేర నటంచు వచించె దీనుఁడై. 28

తే. అనుడు నాతఁడు పరమేష్ఠి యంతరంగ
భీతి నుడిగించి యియ్యవి వేదము లగు
వీనిచెప్పినచొప్పును విడక నీవు
సృష్టి గావింపు మని శ్రుతు లిచ్చె విధికి. 29

వ. తన్మార్గంబునన కదా సర్వప్రపంచంబున సృష్టిస్థితు లేర్పడి నవి వానినుండియే స్మృతులను ధర్మశాస్త్రంబులును బురాణంబులును పుట్టి లోకోపకారకంబు లగుచున్న విది యంతయుం గవిత్వంబు లగు గ్రంథరాజంబులు సర్వప్రపంచంబులం దర్శింపఁ జేయుమహాదర్పణంబు లనియు నవి లేనియెడల సర్వంబు నంధప్రాయంబనియు నెఱుంగు నది మఱియు నాస్థానకవులవలనఁ బ్రభువులకుం గలుగుపరమోపకారంబులు పెక్కులు కల వావిషయంబు తేటతెల్లం బగునట్లు కొన్నినిదర్శనంబులు నిరూపించెద నాలకింపుఁ డని మఱియును. 30

—♦ సాయనమాధవునికథ ♦—

ఉ. సాయనమాధవుం డనఁ బ్రశంసకు నెక్కినభూసురోత్తముం
డాయతకీర్తిపాత్రమయియా ఱగుశాస్త్రములుం ద్రివేదముల్

బాయక సంగ్రహించియుఁ గళల్ గలవాఁడయి బుక్కభూమిభృ
ద్గేయుని చెంగటం గవితఁ జేసె తెలెన్ మును ధీవిశాలుఁడై. 31

ఉ. ఆతని కాదిలక్ష్మి ప్రియమారగ దర్శన మిచ్చి నేను నీ
ప్రీతికి నయ్యెదం గొనుము విప్రవరేణ్య యటంచుఁ బల్కుచున్
బాతరలాడి కోట్ల నిడ వానిని బుక్కనృపాలమౌళి కా
భూతలదేవుఁ డింద మనిముందిడె నందఱు మేలు మేలనన్.

వ. ఇట్లు ధనం బిచ్చుటయ కాక. 33

శా. శ్రీయంత్రమ్మను బోనిపత్తనము రాజిల్లంగఁ దుంగానదీ
శ్రేయోదాయకతీరమందు వివిధశ్రీ లందు సంధిల్లున
ట్లాయా యోగము లెల్ల గూర్చి విజయాఖ్యం బొల్పు మీఱంగ స
ర్వాయత్తంబులు సంతరించి సలిపెన్ హాహా యనన్ లోకముల్.

ఆ. అతనిమీఁద శత్రు లరిమి వచ్చినయప్డు
మాధవుండు కొన్ని బోధనములఁ
జేసి బీతుగుడిపి చెచ్చెఱ వెడలిపోఁ
జేసి కాచె రాజు వాసి మీఱ. 35

—♦ చాణక్యుఁడు ♦—

స్రగ్ధర.
శ్రీశైలప్రాంతభూమిన్ జెలఁగెమును మహాశ్రీలతో నంధ్రరాజ్యం
బాశాభాగంబులన్ బేరధికమగుచు మ్రోయంగ నందుండు రాజై
దేశంబుల్గెల్చి పాల్చెన్నిదినము గడువఁ ద్దేహాజుల్ పొంది రాజ్యం
బీశత్వం బేర్పడంగా నెసగిరి తమతో సీడు రాజెవ్వఁ డంచున్. 36

క. ఆ:వనందులు రాజ్య
శ్రీ నొందిన యప్పుడు విలసిలి రాక్షసుఁ డర్థ
ధీఃధి విప్రశ్రేష్ఠుఁడు
తా నెంతయుఁ జాలి మంత్రిధర్మము నడపెన్. 37

తే. నందులకుఁ జంద్రగుప్తుఁ డన్వాఁడు సవతి
తల్లికిం బుట్టినట్టిఁడు ధర్మమూర్తి
వానియెడ వీరికిం బగ యైన దానఁ
ద్రోసిరా జని రాతని ద్రోహ మనక. 38

వ. ఇట్లున్న కాలంబున. 39

శా. చాణక్యుం డనునీతికోవిదుఁడు విశ్వస్తుత్యవిజ్ఞానని
ర్మాణాంచద్ధిషణుండు శాస్త్రనిచయప్రజ్ఞాసమగ్రుండు వి
న్నాణం బేర్పడ నొక్కనాఁడు నవనందస్థానముం జేర ని
ద్రాణుల్ వాడుతిరస్కృతింజరిపిరాబ్రహ్మణ్యునింగానమిన్.

ఆ. అలుకఁ జేసి యాతఁ డానందరాజ్యంబు
చంద్రగుప్తునందు సంక్రమింపఁ
జేసి రాక్షసుండు ధీసచివుం డయి
యతనిఁ జేరి యుండు న ట్లొనర్తు. 41

వ. అని నిశ్చయించుకొని చంద్రగుప్తునికడకుం జని సర్వంబు నెఱింగించి వానిన్ శిష్యునిగాఁ బరిగ్రహించి కార్యానుసంధానంబునకుం దగునట్లు ప్రయత్నంబు గావించుచుండె నది విని నందులును రాక్షసమంత్రి మంత్రసాహాయ్యంబునం జేసి గండుమిగిలి యుండి రి ట్లున్నప్డు చాణక్యుం డన్న

న్నియొ తంత్రంబులు పన్ని నందుల సంహరించి తద్రాజ్యంబు చంద్రగుప్తున కొసంగి రాక్షసునిం దెచ్చి వాని కమాత్యునిం గావించి తాను నిర్లిప్తుండు గావునఁ జంద్రగుప్తునకుం జెప్పి తపో వనమునకుం జనియె. 42

—♦. తి క్క న – మ ను మ సి ద్ధి ♦—

తే. మున్ను నెల్లూరుపురవరమునను సిరులఁ
బ్రగాలుపాటూరు నాఁబడుగ్రామమందుఁ
గొమ్మనామాత్యపుత్రుఁడు కోవిదుండు
మనుమసిద్ధికాలంబునఁ దనరుచుండె. 43

సీ. ఏమనీషివదాన్యతామహత్వముఁ దెల్పుఁ
విప్రార్పితాగ్రహారప్రసక్తి
యేసూరి వేదమార్గాసక్తిఁ బ్రకటించు
సప్తతంతుక్రియాచరణరక్తి
యేప్రాజ్ఞునుభయభాషాప్రవీణతఁ జాటుఁ
జార్వాంధ్రభారతశబ్దశక్తి
యేధీరునద్వైతబోధ దెల్లము సేయు
హరిహరార్పితకృతికరణభక్తి

తే. ఆసుకృతిష్ఠ యాదృఢవ్రతుఁ డాసుధీరుఁ
డామహాత్ముఁడు తిక్కనసోమయాజి
కవితకుం బ్రహ్మకల్పుఁడు జ్ఞానమూర్తి
సన్నుతింపఁగ నొప్పదే సత్కవులకు. 44

ఆ. అతఁడు మనుమసిద్ధి కాస్థానకవి యయి
భారతంబు వ్రాసెఁ బదియు నైదు
పర్వములు విరాటపర్వము మొదలుగా
ప్రభువుకరుణ కతఁడు పాత్ర మగుచు. 45

మ. ఇటు లాస్థానకవీంద్రుఁడై నృపతికిన్ హేరాళసంపత్సము
త్కట మత్యంతము వృద్ధినొందుపగిదిన్ గావ్యంబు లాశీర్వచః
స్ఫుటసంపత్కముగాఁదలిర్చునటులొప్పల్మెఱగాఁ జేయుచున్
బటిమన్ రాజసభాంతరంబునఁ గడున్ బ్రఖ్యాతికై భాసిలెన్.

ఆ. ఇటులు కొంతకాల మేగినపదపడి
మనుమసిద్ధి మీఁద మార్తురెల్ల
దాడిసలిపి వాని నోడించి రాజ్యము
నపహరించి రాగ్రహాకృతులయి. 47

మ. అపుడాస్థానకవీంద్రుఁడెంతయువిచారాందోళితస్వాంతుఁడై
నృపతిం బ్రోవఁగ నెంచి యోర్గలుపురీనేతం బ్రదర్శించి య
వ్విపులన్ విద్యల నెల్లఁ దెల్ల మగుశీవిన్ జేయుచుం సత్కవి
త్వపురీతుల్ వివరించుచున్ వెలసెవిద్వద్వర్యులగ్గింపఁగన్. 48

ఉత్సాహము. మెచ్చి యోరుగంటిరాజు మీవిరాటపర్వ మేఁ
నిచ్చఁ జదివినాఁడ నెంతయేని సంతసంబు నా
యచ్చలంపుమానసమున కంటె నాఁటినుండి నిన్
దెచ్చి గౌరవింప నెంచితిం గవీంద్ర చంద్రమా. 49

వ. అని చీనిచీనాంబరరాంకవాభరణాదులు నగ్రహారంబులు
నర్పించి పూజించె నప్పుడు తిక్కనాధ్వరియును. 50

ఉ. రాజబిడౌజ! నే నిటకు రాకకుఁ గారణ మొంతు విన్ము నా
రాజవరుండు సిద్ధి తనరాజ్యము శత్రులపాలు చేసి తా
నోజ చెడంగ నుండె నతఁడో గడుపూజ్యుఁడు వానిరాజ్య మే
యోజనుగాని వానికయియుండెను నట్లుపొనర్పఁ గోరుదున్.

క. అనవుడు రా జిట్లను నో
యనఘా! యీమాత్ర కింత యడుగ వలయునో
కొనిపొమ్ము నాదుసైన్యము
ఘనసమరమునందు నరుల గండడఁచుటకున్. 52

వ. అని సేనానులతోడం గొంతసైన్యంబొసంగి యంపిపుచ్చుటయు నతండు మహాసేనాసమేతుండై నిజపురంబునకుం జని మనుమసిద్ధికిం జెప్పి తనతమ్మునిం గూడ సమరమ్మునం బాల్గొనం జేసి శత్రులం జయించి మనుమసిద్ధికి రాజ్యం బిచ్చె మఱియుం జెప్పెద వినుం డని యి ట్లనియె. 53

## విద్యానాథుడు-వీరరుద్రుఁడు

శా. విద్యానాథుఁడు కాకతీయులకడన్ విద్వాంసుఁడై యుండి స
ద్విద్యాజీవన మాచరించుకొనుచున్ దీపింపగాఁ జేసె స
ద్వైద్యం బైనప్రతాపరుద్రచరిత శ్రీదేవభాషన్ గవీట్
హృద్యం బైతగున ట్లలంకృతు లవెన్నోఁ జేట తెల్లంబుగన్. 54

శా. ఢిల్లీల్లోఁ బతి బందె నున్నయపు డుడ్డీనంబుగా గ్రంథ ము
త్పల్లప్రక్రియఁ జేసి వచ్చి పురియందున్ సర్వమున్నించుఁదా
ఢిల్లీ కేగి నృపాలు చెంగటను మోడిం జేసి వాంఛింపఁగా
నల్లోఁ రాజు గ్రహించె వాని నెఱుఁగండా తండు రాజేంద్రుఁ డునిన్.

ఆ. దారి నేగుకవినిఁ దనదండకుం బిల్చి
నృపతి యెవరు నీవు చెపు మనంగ
నతఁడు నేఁ బ్రతాపునాస్థాకవి నొక్క
కృతి యొసర్చి వాని కిడఁగ నుంటి. 56

సీ. నృపతి యిప్పురమున నిపు డుంట విని వాని
కెలనఁ బఠించి యాకృతి నొసంగ
వచ్చినాఁడను నాఁగఁ బ్రభు వనుఁ గవిరాజ!
మీరాజు బందెలోఁ జేరె నిపుడు
నీ కేమి యిడనోపు నీవు తన్నామము
తీసి వేజౌకనామ మేసి యొజ్ల
కిడ రాదె యనఁ గవి యెల్ల పద్యములందు
వానిఁ దగుల వేసినాను జూవె

తే. అనుఁడు నశ్లీల మని వాని నాగి నేన
వీరరుద్రుఁడ నని తెల్ప వెక్కి ౖమింగి
కవివరుఁడు వానిదెసఁ జూడ్కి గలుగఁ జేసి
గీముఁడై యిట్లు వ్రాసెఁ-చ్చెఁ దెలియు మనుచు. 57

క. ఢిల్లి సుల్తానుకడం
జెల్లఁబుగఁ జేరి కొంత తెలుపుచు నీకీ
చెల్లనికారాగారము
నల్లన విడున ట్లొనర్తు నానతి యిడుమా. 58

వ. అని యప్పురి నప్పుడు పిచ్చివానిమచ్చున నుండి తంత్రం
బులు పన్నుచు నున్నమంత్రియుగంధరుమంతనంబున సుల్తా

నుపై కొన్నిపద్యంబులు చెప్పి వానిమనంబు రంజిల్లం జేసి వీరరుద్రునకుం జెఱసాలనుండి విముక్తిం గలిగించె నని మఱియును. 59

—♦ పింగళిసూరన–పేకి ♦—

ఉ. పింగళిసూరనార్యుఁ డని పేరువహించినసత్కవీశ్వరుం
డంగున సత్కృతుల్ సలిపినట్టిఁడు వాని కవిత్వతత్త్వముల్
కంగని ప్రోఁగు లోకమున గంటలుగోలెఁగళాప్రపూర్ణమా
బంగరు వన్నదోసమనిపల్కఁగరాదు సుమంతయేనియున్. 60

చ. అతఁ డొకనాఁడు గ్రామమున కంతటిలోఁ గలమిట్టభూమికిన్
మతి నెదియో కవిత్వమును మాటికిమాటికినోటఁబల్కుచున్
హితులును దానుబోవునపు డేదియొ మోద మొసంగుగాఁ జూప్రా
స తగులఁ గాల్ప్రవేలికిది యేమని తీసి గ్రహించెఁ జేతితోన్.

వ. అది చూచుట కింపగుటం జేసి పాఱవేయక రొండిం బెట్టుకొని పోయి గృహంబునం గలచంమగుపెట్టెం బెట్టి యుంచెనంత నమ్మఱునాఁడు. 62

చ. నెఱసినవెండ్రుకల్ గలిగి నేత్రములం జల మూఱ మేనితోల్
గరగఱి గాక పల్చనయి కానఁగరాఁ దలదోర్చు చూర్చుచున్
చరణము పల్కు తొట్రిలఁగ జట్టువముం గొని మీఁది చేతితో
నఱువది యేండ్లయీడుగలయవ్వ యొకర్తుక వానియింటికిన్.

వ. వచ్చి వంటలక్కను నా పేరు పేకి నన్ను మీయింటనిలుపుకొం దురేని నా కింతకూడును గుడ్డయుం జాలు ననిన సూరన

భార్య నీవు బ్రాహ్మణివే యైనచో మా యింట నుండు మని
దాని నింటం బెట్టుకొనియె నంత నా మదుసలియును. 64

సీ. ప్రాహ్ణంబునన్ లేచి ప్రాచిపనులు దీర్చి
బోలెలు చెంబులుం బొసఁగ దోమి
తోడి బిందెలతోడఁ దోతెచ్చి నీళులు
గాబులు నిండించి కాచి కొన్ని
యుదికి వస్త్రంబులు పదిలంబుగా నార్చి
వంటకం బొనరించి వార్చి గంజి
వడ్డించి యందఱు వరుస లేచినయంత
నెంగిళు లన్నియు నెత్తి సుద్ది
తే. పెట్టి బిడ్డల నాడించి యట్టె రాత్రి
భోజనపదార్థములు గూర్చి ప్రొద్దు గ్రుంక
దీపములు పెట్టి ప్రక్కల నోపి వేసి
వంటపనులకుఁ బోవు నాబక్కవనిత. 65

సీ. పొలములకుం బోయి పుట్లకొలందిగాఁ
వంటకట్టెలఁ గొట్టి వెంటఁ దెచ్చు
భోజనపాత్రముల్ పోహాణించుటకుఁ గా
మేలె డాకులు తెచ్చి మూటు పెట్టు
గెడ్డపలుగుఁ బూని గొడ్డుబాఱినపొల
ముల బెల్లు త్రవ్వఁ గన్ మాయులోన
పదుగు రెత్తఁగలేనివరిపైరుమోపులు
పదియొక్క మాఱుగా పట్టి తెచ్చు

తే. ఇట్లు గృహకృత్యములు గాక యెల్లపొలము
పనులు దీర్చుచు మఱి యెట్టిపనికి నైనఁ
బూనుకొని తానె పొనరించు దేని నైనఁ
గోప మెఱుఁగక యానంటబాపనమ్మ. 66

వ. ఇట్లు కొంతకాలము గడచినంత సూరనార్యునిసహధర్మచారిణి ప్రసవించె నప్పు డాపేకి తానె పురిటిపనులు చేయుచు నామెకుఁదోడుగా నాయింటఁ బండుకొని చీమ చిటుకుమన లేచుచునన్నియుం జూచుచుండు నిట్లుండ నొకరేయి పురిటియింటిలోనిదీపము సన్నగిలుచుండఁ బండుకొని లేవక యెపేకి నాలుకచాపి వత్తి నెగఁద్రోసె నది నిదురించు నట్లుండు బాలింతరాలు చూచి యది యొకపిశాచం బనియుఁ దన్ను మ్రింగు ననియు భయంబున నేమియుం బలుకక గడగడ వడంకుచు గడియయొకమహాయుగంబుగా నారేయి వేగించి మరునాఁ డరుణోదయంబునఁ బేకి ప్రాచిపనులు చేయఁ బోయిన తఱి ప్రాణేశ్వరునిం బిలిచి రాత్రి జరిగినదంతయుం జెప్పనతండునుసంశయాకులచిత్తుండై తత్తఱపడి యిట్లనియె.

చ. ఇదియొక పెద్దదెయ్య మగు నిం దిసుమంతయు సంశయింపనో
ప్పదు మనయింటికిం బసులవంకను వచ్చి భుజించినట్లునున్
నిదుర పొనర్చిన ట్లెవరు నేని యెఱుంగరు వేరి నెప్పు డే
యదనునమ్రింగి వేయునొకటాయెటు సేయగవచ్చునింకిటన్.

వ. కాని మ్మేదియెట్లు జరుగనున్నదో దైవంబు కలదైన నిట్లు చెప్పిచూచెద నని పేకిం బిలిచి నమస్కరించి యిట్లనియె. 69

శా. తల్లీ! నీ కిదె వందనం బెపుడు మాతప్పెందు నీపట్ల లే
దిల్లా లిట్లు భయంబు నొందెడిని నీ వేరీతి వర్తింతో మే
మెల్లం గాంచి యెఱుంగ మీవు నను నాయిల్లాలిన్బిడ్డలన్
ద్రెళ్ళం జేయక ప్రోవ వేఁడుదుని దేవీపాదము న్మ్రొట్టుచున్. 70

వ. అనిగడగడలాడుచున్నసూరనార్యునింగని పేకియిట్లనియె. 71

ఉ. నే నెవ్వరైన నేమి నిను నీవనితామణి నీదుబిడ్డలన్
నీనెఱచుట్టలున్ మఱియు నీపరివారము నెప్పు డెప్పు డే
హానియుఁ గాక యుండుగతి నారయుచుండితిఁగాదె సత్కవీ!
నేను వచింప నేమిటికి నీవ యెఱుంగక యున్నవాఁడవో. 72

క. నావలన మీకు నేభయ
మేవంకను గాని రాద యెప్పటి యట్లే
యీవనితఁ జూడుఁ డిదియున్
మీవలనం గరుణగలిగి మెలఁగెడు నిచటన్. 73

వ. అనిన నత్యంతసాధ్వసావృతస్వాంతుండై సూరన మఱియు 74

తే. ఎంత చెప్పినఁ గాని మాస్వాంతమందు
భయము విడకున్నయది గాన దయ దలిర్ప
మమ్ము విడనాడి పోవఁగా సమ్మతింపు
మనిన నాపేకి యి ట్లను నతనితోడ. 75

వ. కవీంద్రా! నీ వొక్కసాయంసమయంబున వాహ్యాళి చేయు
చుండ నాగాజుఫ్రాస నీకు దొరికినది దాని నీవు నీచందు
వునం బెట్టి కాపాడుచుంటివి ఆప్రాస నాది నాకిచ్చుటయు

కాక నే నొక్క శాపంబున నిట్లు బమ్మరక్కసనై యున్న
దాన నాపైఁ గొన్నిపద్యంబులం జెప్పి నాశాపంబు వోఁ
జేయు మనిన నతం డౌ నని దానిపూసదాని కిచ్చి పేకిపేరఁ
బిశాచమోచనం బనునొక్కచిన్న గ్రంథంబు చెప్పి పేకిం
బరిత్యజించె నని మఱియు. 76

## అడిదము సూరన

తే. విజయరామనృపాల సవిధమునందుఁ
గ్రాలు నడిదముసూరన కవివరుండు
పెక్కుగ్రంథము లొనరించి పేర్మిఁ గాంచె
క్షితిని మాఱటశ్రీనాథుఁ డితఁ డనంగ. 77

తే. ఆంధ్రనామశేషాదులు నవియుఁ గాక
రామలింగేశశతకము రాజుఁ దెగడి
చెప్పె నం దెన్నివిధములఁ జెప్పవలెనొ
యన్నివిధములఁ జెప్పె నం దద్భుతముగ. 78

చ. ఒరులను లక్ష్యపెట్టక సమున్నతి సూపెడువారిలోపలన్
బరిగణియింపఁ గాఁ బడును నైషధకర్త యనంతరంబునన్
ధరణితలంబునం బొగడితం గొని సూరన దేవదేవునే
సరకుగొనండు రాజనగ జంకునుడొంకు నెఱుంగఁ డెన్నఁడున్.

తే. రామలింగేశశతక కారణము గలుగ
రాజు సూరన నగరికి రాకు మనుడు
నాతఁ డగుఁగాత మనుచు నృపాలయంబు
దెసకుఁ గన్నెత్తి చూడక యొసకమెసఁగ. 80

శా. ఆకాలంబున మ్లేచ్ఛవల్లభులు విఖ్యాతంబుగా డిల్లిలోఁ
బ్రాకామ్యం బగున ట్లపూర్వముగ దర్బా రొందుగావింపఁగా
లోకంబందుఁ దలిర్చురాజవరు లాలో వారివిద్వజ్జనా
నీకంబుం గొని వచ్చి రాసభకు నిర్నిద్రప్రభావంబునన్. 81

ఉ. రాజుల నొక్కరొక్కరిఁ బరామరిసించి తదీయు లౌ కవుల్
తేజ మెసంగ నేలికకుఁ దెల్పుచు వచ్చిరి తత్తదున్నతుల్
రాజిలునట్టిచందమున రాజబిడౌజుఁడు పూషవాఙ్మహో
రాజుగుణంబులం దెలుప రచ్చ నెవండును లేకపోవుడున్. 82

తే. రాజు సూరన లేమికి రమణఁ దొఱఁగి
యుండె నాలోన నెట్టెటో యొరు లెఱుంగ
కుండఁ జనుదెంచి యొకమూల నున్నసూర
కవివరుఁడు లేచి యీరీతి గా వచించె. 83

ఉ. "రాజు కళంకమూర్తి రతిరాజు శరీరవిహీనుఁ డంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతరసీమవర్తి వి
భ్రాజితపూషవాఙ్విజయరామనృపాలుఁడు రాజు గాక యీ
రాజులు రాజులా భువి తరాజులు గాని ధరాతలంబునన్."

క. అని పలికి రాజగౌరవ
మును సంరక్షించె రాజపుంగవుల యెడన్
గని రాజు సూరకవినిన్
మనమునఁ గొనియాడె రాజమండలగతుఁడై. 85

వ. అంతఁ గొంతకాలంబునకు. 86

మ. పరరాజుల్ బహుసేనతోడఁ దనపై బాహాబలం బేర్పడన్
దురముంజేయఁగ రాఁగ వారినెదురన్ దోస్సారముం జూపనా
ధరణీంద్రుండు సమస్తసైన్యములతో దండెత్తి పోరాడఁగా
దారకోగం జనెఁగానిశత్రుబలముందోరింప లేకార్తుఁడై 87

క. వెన్నిచ్చి పాఱి వచ్చెను
గన్నులఁ గని సూరసుకవి కటకటపడుచున్
సన్నతగాత్ర తెఱంగున
నెన్నంబడె విజయరామ నృపుఁ డని వ్రాసెన్. 88

తే. అట్లు వ్రాసినపద్యము నానృపాలుఁ
డరసి బిచ్చపుబాపఁ డీకరణిఁ బలికె
నింతకంటెను జచ్చుటే కొంత మే ల
టంచు సాహసధైర్యము లెంచఁ జాలి. 89

క. చతురంగబలాన్వితుఁడై
మృతి కానీ యేమి కాని మే లనుచుఁ గడున్
ధృతిఁ బూని యెదిరిశాత్రవు
నతులితశౌర్యమునఁ బోడిచె నాహవమందున్. 90

వ. అట్లువిజయంబుఁ గాంచి విజయరామనృపాలుండు ప్రోలికి
వచ్చి వచ్చినట్లు సూరనం బట్టి తెప్పించి హుంకరించి
గద్దించుచు ని ట్లనియె. 91

చ. అని మొన నోడిపోయి జలజాక్షి తెఱంగున వచ్చియింట దూ
రె ననుచు నీవు పద్యమును జేకుల వ్రాసి పురంబునన్గడన్

గనుఁగొన వ్రేలఁ గట్టితివి గాదె కవీ! యిపు డేమిచెప్ప దేఁ
బలివడి శత్రులం దునిమి వచ్చితి నచ్చుపువీర్య మేర్పడన్.
ఉ. చెప్పము చెప్పకున్న నినుఁ జెచ్చెఱఁ బట్టి పరాభవించెదన్
దెప్పఁగ వచ్చితే నను మదీయభుజాబల మెట్టిదియున్
జొప్పడియుండెనో తెలియఁ జూడవు బ్రాహ్మణధర్మసంగతిన్
జెప్పితి పుచ్చుపద్దె మది సిగ్గున కయ్యెను గాదె కైసరా.
మ. అనినన్ సూరన యిట్లు పల్కె నరనాథా! పుచ్చుపద్దెంబు నే
నొనరింపం జుమి సారవంత మది యెన్నో వేలశత్రుప్రజన్
దునుమాడె న్నిమిషాంతరంబునను నీదో స్సారమే పాటిదో
మునుమున్నే తెలియంగ వచ్చె నిఁక నోభూపాల! వేయేటికిన్.
వ. అని నిర్భీకుండై పలికియు సూరకవి రాజగౌరవపాత్రుం డయ్యె
నని మఱియును. 95

—♦ క ళిం గ గం గు-భీ మ క వి ♦—

ఉ. రాజకళింగగంగ నను రాజవతంసము మున్ గళింగమున్
రాజితకీర్తి నేలి కవిరాజులఁ బెక్కుర నాదరించె నా
భోజుఁడె వెండియుంబొడమెఁబో యనుపేర్మికి నై ధరాస్థలిన్
రాజబిడౌజుఁ డాతని నిరంతముం గొనియాడ నొప్పెడిన్. 96
తే. ఏమికర్మమొ చెప్పలే మామహీశుఁ
డొక్కతఱి భీమకవి కేదియో యొకానొ
కండయినయెగ్గు పొనరింపఁ జండశాస
నుం డతం డగ్గి యాతని నొవ్వఁ దిట్టె. 97

ఉ. దానంజేసి కళింగగం గతఁడు గోత్రారాజ్యముఁ  సంపదల్
సానందార్థములున్సుఖంబులుసుతుల్ సంసారముం బాసితో
డేనింగానక యొంటిమైఁ దిరిగె నెందే భైక్ష్యముం గోరుచున్
దా నొండొక్క విరాగిచందమున నై నానాప్రదేశంబులన్.

తరువోజ. ఒకనాఁటిచీఁకటి యుర్వీతలమున
నువ్వోత్తుగా నిండి యుండంగ వీథి
నొకరుండ మాధుకరోపలబ్ధికిఁ బు
రోపకంఠముదారి నుండి పోవుచును
నకనకల్ గుడుచుచు నడచుచు నొక్క
నడబావిలోఁ బడి నలుఁగి హాఁ దేవ!
యొకచేదివటి యేని యుండద యయ్యొ
రో! యింక నేమి చేయుదుఁ గర్మగతికి

తే. అనుచుఁ జింతించుచుండ నాప్రాంతమందుఁ
జీఁకటిం జిందులాఘువశీకృతవచ
నుండు వేములవాఁడ భీముండు వినుచు
నివ్వెఱంపడి యోరి నీ వెవ్వఁడ వనె. 99

తే. అనుడు వేములవాడభీమున పొనర్చి
నట్టిజోగిని గంగు నాయాహ్వాయ మన
నృపతిచెంతకుఁ జని లేవ నెత్తి వాని
మేనిపైఁ గలపెందూళి పో నడంచి 100

ఉ. "పాయనిచింత లోఁ దగుల బమ్మరిలంబడి నాకతంబునన్
శ్రీయును సంపదల్ తొఱఁగి చెన్నఱిపోయెనయో యిఁకఁ శుభం

బీమొక నొందఁ గాత మని యొక్క మన "రాజకళింగగంగు తా
బోయినమీనమాసమునఁ బున్నమ పోయినషష్ఠినాటికిన్"
తే. అనుచు దీవించె గంగు రాజ్యంబుమతియుఁ
బొందె నాషష్ఠినాఁటికి భూసురుండు
తాను బోయిన యనుటచేఁ దగిలి శాప
మాదినంబున నే మృతి నంద వయ్యె. 102

## ఆంధ్రకవుల ప్రభావము

తే. వేమ నృపునకు సర్వజ్ఞభూమిపతికిఁ
గలుగువైరము శ్రీనాథకవివరుండు
రాయబారము నడపి పోఁ జేయఁ గలిగి
వారియగచాట్ల నేర్పుమైఁ బాయఁ జేసె. 103
సీ. పద్దెమునం జెర్వు ఘట్టని తెగిపోవఁ
గాపించెఁ బ్రాజ్ఞాటికవివరుండు
తెలగరాయనిచెర్వుఁ దెగనేదె మును బడ
బానలభట్టుంగ్ర మందుకొనఁగఁ
బోతరించినయట్టిపోతరాజును గూల్చె
నాఱింటఁ దాఁ బెట్టి యపు డొకకవి
యాడిన దాటగాఁ బాడినయది పాట
గా నొప్పె భీమనకవివరుండు
తే. తిట్టఁ బడినకళింగగం గట్టెచెడియు
గవియనుగ్రహమున వెండి ఘనతఁ గాంచె
నాంధ్రకవుల మహత్వ మిట్లతిశయిల్లెఁ
దొల్లి మనదేశమునయందుఁ జెల్లుబడిని. 104

తే. చుట్టుప్రావలు నాఁబడునట్టిశక్తి
తెలుఁగుకవితకె కలదయి తెలియ వచ్చు
నాదిభాషకు నిట్టిదోషాక్షరములు
శాపశక్తియు లే దని శాస్త్రము లను. 105

వ. మఱియు నిట్టివి పెక్కు నిదర్శనంబులు మహాకావ్యంబులం జూపట్టెడిం గావున రాజగువాఁడు నిజాస్థానంబున దిగ్గజంబులం బోని మహాకవులన్ మంత్రివర్యులన్ బాసటగా నిలువరించుకొనవలయు నని చెప్పిన శ్రోత లాస్థాన కవిలక్షణంబు లెట్టివి చెప్పు మని యడుగుటయును. 106

గద్యము— ఇది కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి
శాస్త్రిప్రణీతం బయిన స్వరాజ్యాస్థానకవి
సందేశం బను గ్రంథంబున
ద్వితీయోల్లాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు

# ఆ స్థా న క వి

## తృ తీ యో ల్లా స ము.

వ. అక్కథకుండు శ్రోతల కి ట్లనియె. 1

### ఆస్థానకవి లక్షణములు

సీ. నలువ దేడులకుఁ బై నడచునీడు గలాఁడు
పరమోత్తమాన్వయప్రభవుఁ డఖిల
శాస్త్రపురాణాది సార మెఱుఁగువాఁడు
కావ్యనాటకములు గనినవాఁడు
శ్రుతులు నలంకృతు లితిహాసములు కళల్
చదివినవాఁడు విజ్ఞానధనుఁడు
మేధావి సంగీతగాథ లెఱింగిన
వాఁడు లోకజ్ఞుండు వైద్యవిదుఁడు
తే. హయగజాదిశాస్త్రమ్ముల నరసినతఁడు
శుచి యుదారుఁడు ధీరుఁడు సూరివినుత
మార్గమునఁ బోవువాఁ డనామయుఁడు త్యాగి
భోగి యాస్థానకవి యగు పొదల వలయు. 2

శా. చావం దీర్చినయట్లు గాక సభలన్ జర్చించుచుం బద్యముల్
చేవం గుప్పుచుం జిత్రజల్లు వలె నాసీనుల్ బళీ మే లనన్
జీవుండో యన రాజకీయగతులం జిత్రంబు హత్తించుచున్
గావం బ్రోవగం జాలినట్టిండయి వేడ్కం గూర్పగా నొప్పెడిన్.

తే. మంత్రు లాస్థానకవులును మానవేంద్రు
లకును నేత్రము లట్టివార్ సకలకార్య
ములును వారల నడిగియే సలుప వలయుం
గాని కేవలనిజబుద్ధిం గాదు సేయ. 4

ఉ. జాతిమతాదివైరమును స్వాంతములం దిడకోక తొల్లిటన్
భూతలనేత లైనభుజభూభవు లావల రెడ్డిరాజులున్
బ్రీతి సమస్తభూప్రజల వేరము లేనివచఃప్రసంగతుల్
పాతరలాడం బ్రోచుటలు పాటిగం జేయుటలొప్పు నిప్పుడున్. 5

చ. ప్రజలు వచింప లేరు నిజపార్థివదోషము మంత్రు లైన లో
గుజగుజవోవుచుండెదరు కొందఱ నంకిలి నొంది యట్టిచో
సుజనుండు సత్కవీశ్వరుండు సూక్తులు సూపుచు రాజు నుత్తమ
వ్రజమున నిల్పం జాలుటను రాజునకుం గవి ప్రాణతుల్యుండే.

తే. పతి ప్రజాహితమును గోరి వసుధ నేల
వలయు నేకాని స్వేచ్ఛమై మెలంగ రాదు
కొడుకు నే తప్పు చేసినం గోయ వలయుం
దొల్లి యసమంజుసుని తండ్రి ద్రోచ్చినట్లు. 7

మ. కవియు న్మంత్రియు వీరిలోం గవి యెవిఖ్యాతుండు తత్స్థానము
త్సవముం గూర్చెడు నున్నతంబగుచు నాతం డల్ల మంత్రీంద్రుని

న్దవు న ట్లాడి ముదంబునొందుపగిదిన్ సంధింపఁగాఁజాలుఁగా
నవ శేణ్యుండుకవీంద్రుడంచుబలుకన్వచ్చుంద్రిదివారంబులున్.

తే. ఇప్పు డాస్థానకవి యని చెప్పుకొనుచుఁ
వృథగఁ బ్రభుతాధనముఁ దినువిధికి నగుచు
నుండు టది యొప్ప దాతని నుచితరీతి
సత్కరించుచు నిల్ప నౌ సభలలోన. 9

తే. అల ప్రజాస్వామ్యరాజ్యంబునందు నుండు
మంత్రిసామంతులకుఁ బోలె మాన్యుఁ డైన
కవికి "వోటు" చేసెడునధికార ముండ
వలయు దర్బారుల నతండు మెలఁగ వలయు. 10

తే. అప్పుడప్పు "డెసంబ్లిలో" నయినవిషయ
మంతయును గ్రంథముగఁ జేయ నాజ్ఞ యిచ్చు
చుండు టే గాక సద్గ్రంథ మొండు రెండు
"సాలుసరి" సల్పునట్లు శాసనము వలయు 11

తే. పాఠశాలలకే కాదు పాఠకులకు
వలయుగ్రంథము లెన్నియో వజిలు నితర
భాషలం దవి తెలుఁగున వ్రాయునట్లు
ప్రభువు లాస్థానకవిని నిల్పంగ వలయు. 12

— ♦ గ్రామ్య కవిత్వము ♦ —

ఉ. చేనికిఁ జీడపుర్వు వలె శ్రేష్ఠతరం బగునాంధ్రభాషకున్
మానఁగఁ జేయుగ్రామ్యమనుమాఱి మసంగెను. దేశమందు వి

జ్ఞానము మాసిపోవునటు సల్పఁగనై "సినిమాలు" వచ్చె భూ
జానులు సర్వముం దెలిసి చక్కని మందులు సంగ్రహింపుఁడీ.

ఉ. ఇప్పుడు పాఠ్యపుస్తకము లెల్ల నధోగతి నందుచుండె నం
దొప్పులకంటె మిక్కిలిగ నుండెడు నయ్యవి యెల్లఁ దప్పులే
చెప్ప జుగుప్స యేర్పడెడి చెడ్డకృతుల్ గన వచ్చు నెన్నియో
యప్పని యెల్ల నాకవికి నప్పనచేయుట లొప్పియుండెడిన్. 14

తే. బడులలోఁ బాఠ్యపుస్తకాల్ బాలురకును
నేఁటి "సినిమాల"వలెను దుర్నీతిఁ గఱపు
నట్టి వగుచుండు నవ్వాని నాఁగు సుకృత
మివల నాస్థానకవిమీఁదనే యిడ నగు. 15

ఉ. "ఆనరు" గాఁగ నాకృతుల నన్నిఁటి గైకొని సద్విమర్శ మా
స్థానకవీశ్వరుండు విశదంబుగఁ జేయుచు "ట్రాన్సులేట" ర
న్వానికి సాయముల్ సలుపువాఁడయి యుండఁగ నొప్పు నెప్పుడు
న్వానిని గౌరవించుపని పాలకవర్గము మీఁద నుండెడున్. 16

మత్త. ఎల్లిపాటలు బొల్లిపాటలు నేలపాటలు మేటులై
యెల్లభూముల నావరించెఁ గవీంద్రుఁడాతఁ డొలెంకి రా
యెల్లకే యని వ్రాయుచుండు నవే మహోన్నత కావ్యముల్
చెల్లరే యవి రూపుమాసెడుచేఁత చేయఁగ నొప్పదే. 17

తే. నవ్యసాహిత్య మఁట భావనాకవిత్వ
మంట దానికి స్థానము నందఁ జేయ
నొప్పునే? భాషలో గ్రామ్య ముండఁ బోదు
చిత్తగింపుఁడు భాషలస్థితిగతులను. 18

సీ. బమ్మచెముడుచెట్లఁ బడునట్లు గొదగట్టు-
కొకిబికిశబ్దముల్ గూర్చి పెట్టి
భావసంగతు లంచు బాగుమాలినపేళ్ళు
పెట్టి యపార్థముల్ చుట్టఁ బెట్టి
యధికదోషాముంగ శ్లీలములఁతోడఁ
బాషాణపాకంబు పరఁగఁ జేసి
ఘోరాటవిం బ్రొద్దు గ్రుంకినట్లుండునీ
రసరసభావముల్ పొసగఁ జేసి
తే. బ్రహ్మభేద్యార్థకల్పనల్ గ్రాల శైలి
గట్టుతలదాఁటినడకన్నా నట్టు గొట్టి
కంపతోడు గీడ్చినట్టులు కవితఁ గూర్చు
ధీరుఁ గవివీరు దూరనివారు గలరె. 19

ఆ. గ్రామ్య మనుట తప్పు గా నెంచి వ్యావహా
రికము మాదు భాష సకలబోధ
క మ్మటంచు సాకు లిమ్మొ్రయిఁ బలుకుదు
రద్ది వార లన్నయట్లు కాదు. 20

ఉ. వారల గ్రామ్యము ల్సుకవివ్రాసిన గ్రాంథిక మొక్క చెంచువాఁ
డారయునట్లు చేయు డెది యాతని యాత్మ కెఱుంగ వచ్చునో
మీరు గ్రహింతు రప్డు విరమింతురు దాని ప్రసంగ మెల్ల నో
ధీరవరేణ్యులార యిటు తెల్పితి సత్యము నిత్యసంగతిన్. 21

క. చదువక భాషాజ్ఞానముఁ
పద మెఱుఁగక కవిత చెప్పు వారై ఘను లీ

తుదమొదలు లేని గ్రామ్య
మ్మది శ్రేయోదాయకంబ యనుచుందు రయో. 22

ఆ. "జొన్నచేనిలోన నున్నమంచెలక్రింద
గోనిగుడ్డ పఱచి దానిమీఁద
బావతోడఁ బండి పయి గొంగడీ గప్పి
కులుకు చూపుచుండు: గలికిమిన్న" 23

క. అని యున్ననిందు బూతులు
గనియుం గమనింపకుంట కాలమహిమయే
యన వచ్చు నట్టి వ్రాఁతలు
వినఁ గాని వటంచుఁ ద్రోసివేయఁగ వలయున్. 24

మత్త. ఎల్లి పాటలు లాల్లి పాటలు నేసబాసఁ దగుల్చుచున్
జెల్లు నంచు నొకింతయేనియు సిగ్గులేక యసభ్యపుం
బొల్లుమాటలు మాట గట్టుచుఁ బూని కొంద ఱసీతులన్
గల్లకబ్బము లల్లి జొచ్చిరి కల్లబొల్లికవీశ్వరుల్. 25

ఉ. కోయలు కోడులున్ సవరకూళ్లు వాడెడుపాడుబాసలే
న్యాయములంచు వాడుకకు నయ్యవి న్యాయములంచు వానినే
వ్రాయుచు బొత్తకాలుగను బాలురకుం జదివింపఁ జేయుటల్
శ్రేయ మటంచుఁ జెప్పుచును జెట్టలు రట్టులు వెట్టి దుర్వారన్.

తే. ఇట్టి యశ్లీలకావ్యము లీధరిత్రిఁ
బుట్టకుండఁగఁ జేసెడు భూరిభార
మెల్ల నాస్థానకవిమీఁదనే నిలుపఁగ
వలయు నతఁడు సన్మార్గముఁ దెలుప వలయు. 27

ఉ. నన్నయ మూడుపూర్వములు నల్వుగఁ బల్కినపల్కులే కవుల్
పన్నుచునుండు గ్రంథములఁ బాడుకొనం బాదలింపనౌను గా
కున్నతిఁ గ్రొత్తలంజొనుపనొప్పదు కావ్యములందు దేశ్యము
ల్గొన్నగుమాంసలీకము లుఁగూర్చుకొనందగునంచు సత్కవుల్.

సీ. నెమిలికన్నులు దాల్చి నిక్కిసిల్గినఁ గోడి
నెమిలియై నృత్యంబు నెఱుపఁ గలదె
కాకా యనుచుఁ బెద్ద కంఠ మెత్తినఁ గాని
కోకిలంబై కాకి కూయఁ గలదె
వఱువళ్లుఁ ద్రొక్కుచు ఘాంకార మొనరింపఁ
గుక్క సింహం బయి కుదురఁ గలదె
కడునోండ్రపెట్టుచుఁ గాలు జాడించిన
గాడిద గుఱ్ఱమై క్రాలఁ గలదె
తే. గురువు లఘువులు గణములు గొన్ని గూర్చి
కవి ననుచు విఱ్ఱవీఁగుచు గర్వపడుచుఁ
గల్లబొల్లి కవిత్వము లల్ల నేర్చు
కుకవి సుకవియై ఖ్యాతి గొనఁ గలఁడె. 29

చ. చెఱపును వ్రాసి వ్రాసి తమిచేఁ బదినాళ్ళకు నొక్కకాలు గా
విరసపుఁబద్దె మల్లఁగలవెంగలి వశ్యవచఃకవీంద్రుతో
దొరకొనినిందితుండగుచు దొడ్డవిదుగ్ఘటమానువాఁడు మ
చ్చరమున విశ్వసృట్టునకుఁజాలునటంచెదిరించునట్టుగన్. 30

## —♦ సు క వి త్వ ము ♦—

చ. కవిత యనంటిపం డొలిచి కై నిడునట్లు సమస్తవేద్యమై
భువి వెలయంగ నౌననుట పోలును గావునసత్కవీంద్రుఁడో
నవు నవు నన్నచందమున నందఱ కందగ వచ్చుమచ్చునం
దవినపథంబులన్ వెదకి నవ్యకవిత్వము సల్పరా దొకో. 31

తే. దీర్ఘదీర్ఘసమాసముల్ తెరల నీక
మృదుపదంబులు [illegible]చి మెదపి పొదుపు
మీఱ విరిదం[illegible]తె సొంపారఁ బద్య
మల్ల నేర్చిన [illegible]కము హాయి మనదె. 32

ఉ. అద్దములోన బింబ మనునయ్యది వస్తువు కల్గినప్పుడే
నిద్దము గాఁగఁ గానఁబడు నిర్గమనం బగునప్డు కాన రా
దద్దిర సద్యశం బనెడునద్ది శరీరము లేకపోయినన్
దద్దయుఁ గావ్యదర్పణమున న్నశియింపక కాన వచ్చెడిన్.

చ. తెలియగఁ జిత్రకారుఁడు మదిం గలనేర్పునఁ దీర్చి పూవు దీ
వలను మదందమున్ జిలుక వ్రాసినయట్లు కవీశ్వరుండు మే
ల్జిలిబిలిపద్దెముల్ రసము జి[illegible] వ్రాసిన వాని లోకు లిం
పలర గ్రహించిలోనిరుజ[illegible]ను [illegible]సుఖియింతురెప్పుడున్.

చ. ప్రవిమలకావ్యముల్ సలిపి ప[illegible]ను[illegible]కై యశ మందిపొల్చుస
త్కవి ఋషిగానిలొంతి యనగా [illegible] వాతఁడు మంత్రదృష్టిలో
దవిలె సనస్వనిశ్చలుఁ డుదారుడు నై వరశాస్త్రదృష్టిమై
భువనము లెల్లఁ జూచి తెలుపు న్విశదంబుగఁదద్విశేషముల్.

చ. అతఁడు మహోపకారి జగమంతయువింతగ నద్దమందు వ
స్తుతతిబలె న్సుకావ్యమునఁజూపి సుమార్గమునందఁజేయు భూ
గతులను బ్రౌఢలైనమతకర్తలు లోనగువారు పేరి కు
న్నతు లనె కాని తత్ప్రథ మనంత మగమ్య మగోచరంబగున్.

మ. ఒకచోఁగాంచిమఱొక్కచోఁగనగ లేకుష్ణాంశుఁడై యుండు హే
ళికి మిత్రుం డని నేతిబీర యనుపోల్కి న్వచ్చెఁ బేరిష్టుఁడై
యొకచోనాక సమస్తలోకములచెయ్వుల్నెమ్మదింగాంచినె
మ్మికి నై యెల్లరఁదేర్చుసత్కవి జగన్మిత్రుండునానొప్పఁడే.

మ. తనరాజ్యంబునఁ బేర్మిఁ గాంచివిభుతాదర్పంబునన్ దోఁగురా
యఁడొకన్నం గవిమేటియా "సుకవితాయద్యస్తి రాజ్యేనకి"
మ్మనుటన్ సర్వజగంబులం దతఁడు విఖ్యాతుండుతచ్ఛాసనం
బునలోకంబు మెలంగుచుండువిభవంబుంగాంచి దీపించుచున్

మ. కవులే గల్గక యున్నఁ గావ్యము లెసంగం జెల్ల వద్దాన నీ
భువనంబుల్ భువనాధినాథులునుదత్సామ్రాజ్యప్రవృత్తంబులున్
సువిశేషంబు లెఱుంగ లేక జగ మెందుం జీఁకటిం గప్పిన
ట్లవుగానం గవిభాస్కరుం డనఁగ నౌ నధ్యాత్మతత్వంబునన్.

## ఆంధ్ర దేశ ప్రశంస

తే. అంగవంగాదు లేఁబదియాఱు దేశ
ములఁ ద్రిలింగాఖ్యదేశము సలలిత మయి
క్రాలు శ్రీగిరిఁ గాళేశ్వరమున దక్ష
వాటిఁ గలమూడులింగముల్ వఱలు కతన. 40

ఉ. అమ్మనఁ బేర్మి దాని ననయమ్ము ధరించుటఁ జేసి యంధ్రనా
మమ్మును బొందె దేశ మిది మానధనైకశరణ్యమై జగ
త్సమ్మతమై సమస్తజనసంభృతమై సుకవీంద్రగుప్తమై
ముమ్మరమైన తేజమును బొంది తలిర్చెడు భారతమ్మునన్.

క. ఆంధ్రత్వ మాంధ్రభాషయు
నాంధ్రావనిపై నివాస మాజన్మముగా
నాంధ్రకవిత్వముఁ గొని నీ
రంధ్రప్రభఁ గాంచ నెంచుఁ గ్రతుభుజుఁ డైనన్. 42

శా. మున్నాన్నయభట్టు మెట్టుటను బెంపుం జెందె రాణ్మందిరం
బెన్నం దిక్కనకల్మి సింహపురియున్ హేమించె గుడ్లూరదె
ఱ్ఱన్నగాంచుట వాసిగాంచెముగురయ్యల్ మూడులింగంబులై
వన్నెం బెట్టఁ ద్రిలింగ దేశ మిది భవ్యంబయ్యె దేశంబులన్.

సీ. గౌతమీకృష్ణవేణీ తుంగభద్రా పి
నాకినీముఖ మహానద్యవితము
శ్రీశైలపత్తన శ్రీకూర్మసింహాద్రి
శేషాచలాది విభూషితమ్ము
వీరభద్రేశ్వర వేంకటేశ్వర మల్లి
కార్జున భీమేశ్వరాంచితమ్ము
బందరు నెల్లూరు వరపిఠాపురరాణ్మ
హేంద్రాదినగర సమీక్షితమ్ము

తే. రాజరాజమహేంద్ర వీరప్రతాప
రుద్ర కృష్ణరాయేంద్ర సుభద్రరాజ

పాలితము మాధ్వవాదిసత్పండిత పరి
వృత మది త్రిలింగదేశము వెలయుచుండు. 44

సీ. అమృతకుండముఁ గప్ప నమరి సేవించినఁ
బుణ్యప్రదం బగుపుష్పగిరియు
శిఖరదర్శనమాత్రఁ జేసి పునర్జన్మ
మును బాపు శ్రీశైలభూధరంబు
కలికల్మషము లెల్లఁ గడతేర్చు వేంకటే
శ్వరునివాసము శేషశైలవరము
కృష్ణవేణీతట కీర్తితకనకదు
ర్గాలక్షిత మ్మింద్రకీలధరము

తే. ఇట్టినగములం బొల్చు నం దింద్రకీల
మందుఁ బాండవమధ్యముఁ డధివసించి
దివ్యశస్త్రాస్త్రములు పొంద దేవదేవుఁ
గూర్చి తపియించి సిద్ధినిఁ గొనియె మున్ను. 45

సీ. చవిటిపఱ్ఱలయందు శాల్యన్నములు వెట్టి
మనుచునీగౌతమీమండలంబు
నిరుపేదయే నవనిధు లెక్కి యాడంగ
మఱగించు గౌతమీమండలంబు
శేషాహి నెదిరింపఁ జేయువిద్యల నిచ్చి
మన్నించు గౌతమీమండలంబు
ఇలకు నింగికి సూత్రములు పన్ను తెలివి సం
పాదించు గౌతమీమండలంబు

తే. ఆయురారోగ్యపుత్ర పౌత్రాభివృద్ధి
యును దయాశౌచములును శాంత్యుత్సవాభ
యాదుల నొసంగి ప్రజల మే లరయునట్టి
మాతృకామణి గౌతమీమండలంబు. 46

ఉ. మౌర్యులు చంద్రగుప్తుఁడును తుమ్మతల మేలినవారలాంధ్రుల
య్యార్యులసంతతింబాలిచినట్టిఁడు పిమ్మట బిందుసారుఁడున్
శౌర్య మెసఁగఁ బెక్కురగుసైనికులం గొని దేశమెల్లఁ దా
త్పర్యముతోడ నేలుకొనెఁదా విభులోకవిభూషణంబ మై.

సీ. సాతవాహనువెన్క సామ్రాజ్య మేలిన
రాజు శ్రీముఖుపేరఁ గ్రాలువాఁడు
అతఁడు చికాకోలునందు రాజ్యస్థాప
న మొనర్చుకొని పేర్మి నమరినాఁడు
వానికిం బదపడి వానిసంతతివారు
పడమటిదిక్కుగాఁ బ్రాకినారు
పదపడి వింధ్యాద్రి మొదలు మైసూర్వరి
వఱకాంధ్రరాజ్యము ప్రబల మయ్యె

తే. మొదట నీహిందుదక్షిణభూమియందు
మొట్టమొదటఁ బెద్దది యనఁ బొల్చురాజ్య
మద్ది యొక్కటియే యనునట్టియశము
నంది సకలలోకఖ్యాత మగుచు నలరె. 48

సీ. భారతమ్మున జగద్వ్యాప్తుం డగురాజ
రాజనరేంద్రుఁ డాంధ్రమునఁ బుట్టె

వేదభాష్యము చేసి విఖ్యాతిఁ గొన్నవి
ద్యారణ్యమాధవుం డాంధ్రసుతుఁడు
ప్రజలకై బంగరువర్షముం గురిసిన
వీరరుద్రుం డాంధ్రభూరమణుఁడు
విద్యల భోజుఁడన్ బిరుదు గాంచినకృష్ణ
దేవరాయం డాంధ్ర దేశవిభుఁడు
తే. నన్నయాదులు మఱియు శ్రీనాథముఖులు
నాంధ్రకవులని గర్వింతు నాంధ్రసుతుఁడ
ఢిల్లిసుల్తానుఁ బట్టి యోడించినట్టి
ఘనుఁడు మేధావి మంత్రియుగంధరుండు. 49

సీ. నారసింహోప్పరాణ్మాన వేంద్రుఁడు ధ
ర్మావతారం బనునాఖ్యఁ గాంచె
విజయనగరమందు వెలసినయానంద
గజపతి ఘనుఁ డయి కాంచెఁ బేర్మి
రావుగంగాధరరామరాయఁడు పుట్ల
కొలఁది భూములు దానముల నొసంగె
సీతమాజోగయాఖ్యాకులపే ర్లెల్ల
భూమండలంబుల మ్రోసెఁ గాదె
తే. వివిధవిద్యలయందుఁ బ్రవీణు లగుచుఁ
దగిరి హరిశాస్త్రి విశ్వనాథప్రముఖులు
వీర లందఱు నాంధ్రులు వీరికీర్తి
యెట్టిదేశముఁ జేరికేని లేదు. ౫౦

—♦ తేటతెలుఁగుఁ గవిత్వము ♦—

చ. తెలుఁగది వీరి భాష యయి తేజరిలున్ గద దేశభాషలన్
తెలుఁగది లెస్స యంచుమును దెల్పెను రాయలు దేవభాషకుం
దుల యగునద్ది వేదమును దోపగఁ జేయుచునుండు దానిలో
వెలసిన దే కవిత్వమది వేల్పుఁబువ్వకుఁ దీటు వచ్చెడున్. 51

ఉ. జాజుల నేరి మాలకరి చక్కనిదండలఁ గూర్చినట్లు వి
భ్రాజితశబ్దజాలమునఁ బద్యము గద్యముఁ జేర్చి కబ్బముల్
దేజ మెసంగఁ జేసిన సుధీవరు లెల్లరు దానిసౌరభం
జాజగజంపుసొంపు గొన నందఱు కుప్పిళు లూఱకుండునే. 52

సీ. ముత్యాలకోవనా నత్యంత మమరెడు
మృదుశబ్దజాలంబు పదిలపఱచి
మొదలు పెట్టినఁ దుట్టతుదదాకఁ గమ్మెచ్చు
నందీఁగ నాసాఁగి నడువఁ జేసి
జాతియు రీతియు శయ్యా పాకంబును
శైలియు లీలమై జతనుపఱచి
యావంత యరసిరే నర్థభావంబులు
తేటతెల్లంబుగాఁ దెలియఁ జేసి

తే. తగునలంకారములు పెట్టి సొగసు మీఱ
నవరసంబులు చిప్పిల నవనవముగఁ
గల్పనలు చేయుచును జీవకవితఁ గూర్పఁ
గలుగుకవిని మెచ్చనివారు గలరె జగతి. 53

బంధురవృత్తము. [నం

మునుకొనిపరిమళమునఁగను మృదులంబుందగుచల్వయుఁ బొందిజ
బును వలపునఁ జనఁ బొనరుచు మలయంపుం బవనంబున బొల్పగుతీ

పొనరినసరిపకునోకొయనియనన్నై యొప్పుకవీంద్రులయుల్లములన్
దనరగ నొనరుచు తెగవున నగునావంటకవిత్వపుదఁదడికిన్. 54

చ. తెలుగెట సంస్కృతంబెచట దేశ్యమదెచ్చటనన్య దేశ్యముల్
మలయగఁజేయుటెచ్చటసమాసము లెచ్చటఁ జేర్ప నొప్పునో
తెలిసి కవీశ్వరుండు నిజతేజము పేర్పడఁ గబ్బ మల్లినన్
పొలిచెడు దానికమ్మదనముం గనిలోకము సంతసింపదే. 55

క. విరిపొట్లం బది విప్పిన
తరుణంబున మదికి నెట్లు తగిలెడు నామో
దరసంబు సుకవికావ్యము
పరికింపఁగ నట్టిరసము పడయుం గాదే. 56

మ. కలముం బట్టిన నట్టె చూచుతటిలోఁ గావ్యార్థముందోచున
ట్టులు గావించెడువాఁడె పో సుకవి యట్లుంగాక కొన్నేళ్ళకుం
దెలియం బాద మొకండుగా సలుపుచా దేబయ్య దేబయ్యగా
కలస్రమాట్పదమందు నర్హుఁడగునయ్యా! వేయిజన్మాలకేన్.

క. కోకిలయుఁ గాకి కులమం
దే కాకృతి నుంట నెద్ది యెద్దియొ తెలియున్
గాకుండు మాధవాదృతి
గోకిలయుం గాకి తెలిసికోఁబడుఁ గాదే. 58

క. కవి యితఁడు కబ్బ మల్లును
గవి యీతఁడు కబ్బ మల్లుఁ గాన నిరువురున్
గవు లని చెప్పం బడుదురు
కవితత్త్వ మెఱుంగఁ దెలియుఁ గవియుఁ గుకవియున్. 59

—♦ ప్రస్తుతము ♦—

శా. శ్రీశై పుట్టెఁ బోయట్టులారియటు ముం జేకోఁగ శ్రీపాదకే
వాకో నయ్యెఁ దదీయశిష్యునకుఁ జెల్వొంపిళ్ళకుం జెందె నా
యాకల్పంబు సంజసంబ యగు భక్తాభీష్టముం దీర్చి యే
కాకుత్థ్సుండు స్వరాజ్య[illegible]మును వేడ్కంగాంచుట ల్గాంచమే.

మ. మునుమున్నాసుఁడుభో ఁదర్శనముననొ్మ్రమోడినల్లిక్కలున్
స్జని పద్యంబులు హృద్యముల్ చదివెనాచందంబు నేఁడీసభన్
గనుగోవచ్చును భోజులిందఱు మహాగ్రంథంబులం బల్కఁగ
ల్గినవార్ సత్కవులంచు నెల్లరకు సంకీర్తింపఁగా నయ్యెడిన్. 61

సీ. గండ పెండేరము కవి కిడునాఁటు భు
వనవిజయము జ్ఞప్తి వచ్చు నిపుడు
కాశిఖండముఁ గొని కవిఁ గొల్చునప్పటి
త్రిభువనవిజయంబు దెలియ వచ్చు
వాణి నారాణి నాఁ బలుకఁ గల్గినకవి
యిప్డు మదికి వచ్చు నట్టెఁ డగును
గడకు నూర్వద్దెముల్ నుడువఁ గల్గినవారు
ప్రత్యక్ష మగుచున్నవార లిందు

తే. కవికి సాక్షాత్కరించు వాక్కాంత యన్న
నమ్మకుండెద రిప్పుడు నడుము వంగి
నట్టిముదుకలియు సుధర్మయందు నిందుఁ
బడుచువాఁడయి చూపట్టవచ్చుఁ జూండి. 62

సీ. చెన్నరాష్ట్రప్రభు త్వోన్నతాంధ్రాస్థాన
కవిశేఖరుఁడు బహుగ్రంథకర్త
యవధానములయందు నారితేఱెఁ జతుర్వి
ధకవిత్వవిదుఁడు శబ్దప్రపంచ
చతురుండు దిన మొక్కకృతి చేయఁ గలవాఁడు
గండపెండెరము డాకాలఁ దొడిగెఁ
గవిసార్వభౌమవిఖ్యాతుఁడు బహువిధ
బిరుదముల్ దాల్చినబిరుదులాఁడు
తే. శ్రుతి యెఱిగిఁ శ్రౌతి యయ్యె నాచతురమతిని
ఘనులు కైవసమున నిల్పుకొనఁ గలిగిరి
ప్రభువులు తదీయసత్కవిత్వము ప్రపంచ
వేద్య మగునట్లు చేయుచుఁ బేర్మిఁ గనుఁడు. 63

సీ. అయిదేండ్లపుడె వారి యయ్యగారు కథ లెన్నొ
నొడివి లోకజ్ఞాన మిడినకడిమి
యాబాల్యముగ నన్నయాదిభారతమును
విని చదివిన దాన వెలయుఫలము
ననవరతము లోన నాంధ్రనైషధకర్త
కవితామహత్వము కనెడుగురుత
వీడక బాలాదేవి నెడ నాల్క నిడికొని
ధ్యానించుచుండెడు దానిమహిమ
తే. కారణం బయి ప్రోత్సాహకరము లగుట
నూటయేఁబదిగ్రంథముల్ మేటు లెన్న

సలిపి కవిసార్వభౌముఁడై చనుట కాక
కృష్ణుఁ డాస్థానకవి యయి జిష్ణుఁ డయ్యె. 64
శా. హిందూదేశము దాస్యజీవనము వో హేరాళసంపత్సమృ
ద్ధిం దళ్కొత్తుచు నెల్లదేశములలోఁ దేజస్వియై సాటి యెం
దెందుక్ లేనివిధంబునం బ్రబలిపోయింగూర్చుచున్ స్వప్రజా
సందోహంబున కొప్పుగాత మనుచు న్సర్వేశ్వరుంగొల్చెదన్.

—♦ శాంతి వచనము ♦—

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

సహనావవతు సహనౌ భునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వినావధీత మస్తుమావిద్విషావహై.
ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః

గద్యము— ఇది శ్రీకవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి
శాస్త్రిప్రణీతం బయిన స్వరాజ్యాస్థానకవి
సందేశం బను గ్రంథంబునఁ
దృతీయోల్లాసము.

శ్రీ శ్రీ శ్రీ

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి. 14—9—1950.

# సవరణ

| పేజీ. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 7 | కరఁబుల | కరంబుల |
| 7 | 7 | రంతస్ | రంతఁ |
| 8 | 15 | పిధముల | విధముల |
| 16 | 13 | తొలఁగి | తొరఁగి |
| 23 | 2 | నెఱుంగ | నెఱుఁగ |
| ,, | 3 | శా. | ఉ. |
| 25 | 5 | డన్ న్వాఁడు | డన్వాఁడు |
| 29 | 3 | నాస్థాకవి | నాస్థానకవి |
| 34 | 22 | గన్నతి | గన్న త్తి |
| 38 | 1 | ఉ. | శా. |
| 39 | 6 | వయ్యో | నయ్యో |
| 40 | 15 | మదందము | మరందము |
| 44 | 22 | సితి | స్థితి |
| 50 | 11 | బ్రున్న | బ్రున్నన్ |
| 52 | 1 | వృద్ది | వృద్ధి |
| 53 | 19 | యాఖ్యాకుల | యాఖ్యాతుల |
| 54 | 9 | జాజ | బాజ |
| 55 | 16 | తెలియఁ | తెలితుఁ |
| 56 | 4 | సంజసంబ | సమంజసంబ |
| ,, | 13 | విజంబు | విజయంబు |
| ,, | 15 | యుష్టు | యష్టు |